వీరభద్రకవి, వక్కలంక

వాసవదత్తాపరిణయము

రాజమహేంద్రవరము, 1897

Record no.91

Vīrabhadrakavi, Vakkalaṅka

Vāsavadattāpariṇayamu

Rājamahēndravaramu, 1897

Record no.91

## Bibliographic Record Target

వీరభద్రకవి, వక్కలంక.
వాసదత్తాపరిణయము / శ్రీవక్కలంక వీరభద్రకవి ప్రణీతము.-
రాజమహేంద్రవరము : శ్రీవివేకవర్ధనీ ముద్రాక్షరశాల,1897.
92 p. ;19 cm.
Record no.91

Vīrabhadrakavi, Vakkalaṅka.
Vāsadattāpariṇayamu / Śrīvakkalaṅka vīrabhadrakavi praṇītamu.- Rājamahēndravaramu : Śrīvivēkavarthanī mudrākṣaraśāla,1897.
92 p. ;19 cm.
Record no.91

# వాసవదత్తాపరిణయము

ఇది

## శ్రీవక్కలంక-వీరభద్రకవి

ప్రణీతము.

రాజమహేంద్రవరము.

శ్రీవివేకవర్ధనీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడి

శ్రీవక్కలంక - భీమశంకరము గారిచేఁ

ప్రకటింపఁబడినది.

1897.



వెల ౫ అణాలు.



# వాసవదత్తాపరిణయము.

## ప్రథమాశ్వాసము.

శ్రీరామానయనోత్పలంబులు విరాజిల్లం దరస్మేర దృ
క్కాంత్యస్ఫుటచంద్రికల్మెఱయ నందంబొ ప్రసన్నానన
స్ఫారేందుద్యుతిఁ బొల్చు వెన్నుఁడు జగత్ప్రఖ్యాతచారిత్రునిన్
ధీరస్వాంతుని గావు మాధవధరిత్రీకాంతున్ బ్రోవుతన్. ౧

సీ. అలినీలములజాలములనేలఁ గలనీల కచ నిగన్నిగ సోయగంబుతోడఁ
జెలువొందు నల యిందుకళలందు గలకందుఁ గనినవ్వు నవ్వుమొగంబుతోడఁ
బవడంపుఁ గవ కెంపు రవ పెంపు రదళింపుచున్న బింబాధరద్యుతులతోడఁ
జగమెన్నఁ దగఁ గ్రన్న నగమన్ననఁగ నున్న కొనుచక్కఁదనంబు గరిమతోడఁ
గొమరుఁ బ్రాయపు సిరిముద్దుగులుకఁ బ్రబలి హరి యురమ్మున నెలకొన్న సరసిజాక్షి
కలిమిఁ బ్రాఁబోఁడి సిరులిచ్చుఁగాత రావు । రామచంద్రుని మాధవరాయమణికి.

చ. అజనిజసృష్టికాదియయి హవ్యము లైకొని సోమయాజియై
గజిబిజి రేయునుంబగలుఁ గల్పనసేయుచు శబ్దహేతువై
త్రిజగదణుత్వసిద్ధి ప్రకృతిత్వము లైకొని పొల్చు నావృష
ధ్వజుఁ డజుఁ డష్టమూర్తి ప్రమదంబొసఁగున్ గృతికర్తకెయ్యెడన్. ౩.

సీ. ఘనసారసవిధంబు ఘనసారసవిధంబుఁ గలుగు హాసంబు మొగంబుఁ దనరఁ
గువలయామోదంబు గువలయామోదంబుఁ గూర్చు భూషణమును గుణములలర
విధుకాంతసన్నిధి విధుకాంతసన్నిధియగుచు మైత్రియు సమాఖ్యయును మెఱయఁ
బంచాననాభిఖ్యఁ బంచాననాభిఖ్యఁ దగు వాహనంబును ధవుఁడు మెలఁగ
నలరుచును సామి సామికేహంబునందు । ననుదినంబును వసియించు వనజగంధి
సర్వమంగళ శుభములొసంగుఁగాత । రామచంద్రుని మాధవప్రభుని కెపుడు.

మ. సతతంబున్ దివిషద్గణంబు లోకపజ్జన్ సేవగావింప భా
రతి పాదాంబురుహంబులొత్తఁగ మునివ్రాతంబు గీర్తింపఁగా
నతులప్రౌఢిమ నబ్జజాండములసంఖ్యన్మించ నిర్మించు వా
క్సతి దీర్ఘాయువొసంగి మాధవ మహీకాంతాగ్రణిన్ బ్రోవుతన్. ౫.

సీ. హృదయేశ్వరుండు సమ్మదముతో మోమిచ్చి మన్నింప నలరు భామాలలామ
రాయంచ కొదమగుబ్బముల తేరెక్కి వాహ్యాళి వేంచేయు లోలాబ్జనయన
యల్లి సత్కవుల జిహ్వాగ్రరంగముల నిత్యము నాట్యమొనరించు నాటకత్తె
పవనాప్తి వీణ సప్తస్వరంబులఁ బల్కు మచ్చటలాలించు ముద్దరాలు
శారద శశాంకబింబాస్య శారదాంబ । యభినవోన్మేష శేముషీవిభవ శుభద
చతురభాషావిశేష మొసంగుఁగాత । సంతసంబున మత్కృతిస్వామికెపుడు.

చ. పదముల నందియల్మొరయ బాలకభావములొప్పఁ బాప జ
న్నిదములు చెన్నునింపఁ బలుసేరుపులం దనముద్దుఁజూపుచు
న్మదనమదాపహారికి హిమక్షితిభృత్తనయా లతాంగికి
న్ముదమునయింపఁ జేయు ఘను మోదకహస్తునిఁ బ్రస్తుతించెదన్. ౭.

సీ. అంభోధివలయిత కుంభినిజననుత దంభశాంభవకళాజృంభితములు
నందివాహపదారవింద విశ్వాసమరందసంపాద నైందిందిరములు
స్వేక్షణాదర నరాధ్యక్షు లక్ష్మీప్రదానక్షమ సామ్రాజ్యదక్షిణములు
కూహాపరాత్మబోధాహతస్వాంత సందేహాలీలావశ్యతోహారములు
ధీరతాగుణమణిహారి జంగులూరి । లింగగురువర సత్కృపాపాంగ వీక్ష
ణములు సతతంబు శుభనిదానంబులగుచు। శిష్యజనముల దయను రక్షించుఁగాత.

క. శ్రీరామచరిత్రామృత । ధారా సంపాతవర్ధితప్రజ్ఞా వి
స్తార లతికాలవాల శ । రీరు న్వాల్మీకిఁ దలఁతు హృదయాబ్జమునన్. ౯.

సీ. వ్యాసు భారతసుధీవ్యాసవర్ణనచేసి బాణు భామాపంచబాణుఁ దలఁచి
శ్రీహర్షు సుకవితా శ్రీహర్షుఁ బూషించి భారవి భారవిఁ బ్రస్తుతించి
భవభూతి వాక్యవైభవభూతిఁ గొనియాడి మాఘు నిర్గళితకామాఘుఁ బొగడి
చోరు నిస్తుల్యవాచోరుపాటవ మెన్ని శివభద్రు శివభద్రుఁ దవిలి తలచి
కాళిదాసుని సత్కృతికాళిదాసు । హృత్ప్రభాహారవైభవు నిచ్చమెచ్చి
దండి దుష్కవిభంజన దండివిభుని । మదిఁదలంతు నుతింతు నమస్కరింతు. ౧౦.

ఉ. భారత సంహితార్థముఁ బ్రబంధముగాఁ బటుసంస్కృతాంధ్రభా
షారచనన్ ఘటించి భువి సన్నుతిఁ గాంచినవారి మువ్వురన్
ధీరుల నామనంబున నుతింతు సుధీఘను నన్నపార్యు వా
క్సారసగర్భుఁ దిక్కమఖిచంద్రు మహోన్నతు నెఱ్ఱప్రెగ్గడన్. ౧౧.

శా. ఛాయాస్థానమునందుఁ బూజఁగొని భూప్రఖ్యాతిగా సత్కృతుల్
వేయాఱుల్ విరచించినట్టి ఘనుల న్వేమారు భావింతు స
ద్ధేయ ప్రాభవు నల్లసానికులజున్ ధీశాలిఁ బెద్దన్నఁ దే
జోయుక్తుం దగు సూరనార్యుఁ గవిరాజున్ రామలింగాఖ్యునిన్. ౧౨.



సీ. ప్రాత భారద్వాజగోత్రుండౌ మాచప్రధాని యేఘనపుణ్యు తాతతాత
సహజపాండిత్య భాస్వరుఁడగు మార్కొండదండేశుఁ డేమంత్రి తాతతండ్రి
చారుభాషాఫణీశ్వరుఁ డలకొండ సత్కవివర్యుఁ డేగుణోత్తరుని తాత
వివిధశాస్త్రరహస్యవేదియౌ చంద్రశేఖరుఁ డేకవీంద్రశేఖరుని తండ్రి
యట్టి గుణధాము వక్కలంకాన్వయాబ్ధి। సోము జగ్గాంబికాప్రియ సుజనగేయు
వజ్జపకుభాస్కరుని మృదుమధురవచన। రచనమెప్పింతు మది నెంతుఁ బ్రణుతి సేతు.

చ. దినదినమున్ సమస్త జగతీవరవర్య సభాంతరంబులన్
దన మధురప్రబంధ కవితాలసదుక్తి సుధారసంబు స
జ్జనులకు వీనుపంపువులు సల్పఁగఁ బ్రస్తుతిగన్నధన్యు మ
జ్జనకసహోదరున్ సుగుణసాంద్రుని లింగకవీంద్రు నెంచెదన్. ౧౪.

ఉ. సంధులుజాఱ సత్కవులసంగతిగానక హీనవృత్తి సం
బంధములేమొనర్చుచుఁ గుపంకిలజీవనరూఢిగాంచి హృ
ద్బంధురసౌమనస్య పరిపాటి యొకింతయుఁ గాంచరన్న కు
ష్కాంధులె నిక్కమూ సరసులా తలఁపం గుకవీంద్రులెందునన్. ౧౫.

ఉ. చేకొనునెందు విడ్జతను సీక్తపదార్థములే గణించి య
స్తోకవిభూతి నాశుకనిఁ జూచినఁ బోరుచు నేకనేత్ర పం
కాకృతినుండు, ధర్మగుణహారిరవంబులు విన్నఁగావనుం
గాకవిచూడఁ గాకవియెగాక సభాస్థలిఁ బూజకర్హుఁడే. ౧౬.

వ. అని సకలజగత్ప్రధానదేవతా గురువర చరణారవింద వందనంబును బురాతనాధునాతన ప్రసిద్ధ సుకవివరాభివర్ణనంబును గుకవి నిరాకరణంబునుం గావించి యేనొక్క ప్రబంధంబు సేయ నుద్యోగించియున్న యవసరంబున. ౧౭.

సీ. శ్రీ సరసీరుహాక్షీ విహారాయతాయతన మేప్రభుని నేత్రాంచలంబు
జరఠకచ్ఛప భోగిసార్వభౌమక్రాంతిహారి యేనృపుని బాహాబలంబు
హరిపదాంబుజమరందాస్వాద సంతుష్టమదభృంగ మేతేనిమానసంబు
చంద్రకందర్ప వసంతమందాత్మప్రదం బేమహీశు సౌందర్యవిభవ
మతఁడు నుతిగాంచుఁ గురుకరహాటలాట । మత్స్యకుంతల బర్బర మగధముఖ్య
వివిధదేశ ధరాధీశ సవిధవినుత । రమ్యగుణహారి మాధవరాయశౌరి. ౧౮.

వ. వెండియు నఖండధరామండలీ మండనాయమాన నానసమాన గుణమణిగణశోభిహా
హార్యుండును గాకతిరాయ రాజ్యసంస్థాపనాచార్యుండును గుండపృథ్వీబృందారక
ఘను, మందారహారకర్పూర, డిండీర, పాండురచ్ఛాయాచ్ఛాయాదకీర్తి ముక్తా
ఫలదామాభిరామ భూషాభూషితాశేష దిగ్యోషాతనూరూషిత కుంకుమపంక
శంకావహ ప్రతాపసముజ్జ్వలుండును పెతాళవర ప్రసాదోద్యద్బలుండును సుందర
వదనారవిందమందస్మిత చంద్రికావికసిత మిత్రనేత్ర కైరవుండును గగవాల భైర
వుండును ఖ్యాతాసేతుశీతాచల యాతాయాత మేదినీ సురవర సంతతదీయమాన
దానధారా సంజాత నూతనవాహినీ సంగమోత్సాహ మోహాతిరేక సంతోషిత
ద్వీపవతీకాంతుండును బ్రతాపహనుమంతుండును సంగరరంగాభంగుర మాతంగ
తురంగ రంగచ్ఛమూపద్ధతి సముత్థిత రజఃపుంజమంజు నికుంజసంజాత త్రాసలీ
నారినారీ పరివారుండును నవబిరుదురుగండలాంఛనోదారుండును సరససాహిత్య
సంగీతచతురగోష్ఠీ సభాజనసంతత గీయమాన నిజకథాప్రసంగుండును రాయ
రాహుత్త వేశ్యాభుజంగుండును ముకురాననా నికర మకరాంకుండును జగన్నొబ్బ
గండాంకుండును నిస్తులాస్తోక ప్రభాశస్తదోస్తంభ సంభృత విశ్వంభరాభారుం
డును నుత్తమ శూద్రావతారుండును నిజప్రతాప నవీనమార్తాండపిచండిల ప్రభా
మండలాపహసితాఖర్వ పూర్వస ప్తసైంధవుండును సప్తసప్తిగోత్ర పద్మనాయక
బాంధవుండును విమత భూకాంత, కాంత కోటీరకోటిరత్ననూత్న చిరత్ననూత్న
ప్రభాటోపదీప నీరాజిత చరణయుగళోద్దాముండును బ్రతిగండభైరవ బిరుదాభి
రాముండును ~~[illegible]~~ సదయ నిజాభ్యుదయ దిదృక్షాదక్షసపక్ష జనతావనీమధుం
డును నేకశిలానగరసమీపారణ్య శాత్రవ గిరికూట వజ్రాయుధుండును వివిధ
బుధదైన్యధ్వాంత మిత్రుండును రేచర్లగోత్రపవిత్రుండును జరణద్వయ శరణా
గత రణాగత విమతజన సంరక్షణకృపాళుండును బంచపాండ్య విపాళుండును
సంతత చింతితార్థప్రదాన సదానందహృదయ వైష్ణవకృతాశీర్వచ~~[illegible]~~నాను
కూలశీలుండును రాజమహేంద్రవర హల్లకల్లోల లీలాభీలుండును రావువంశాం
భోరాశి చంద్రుండునునగు మాధవరాయ ధరామహేంద్రుం డొక్కనాఁడు
శాతకుంభస్తంభ సంభృత పద్మరాగ కలశ ప్రభావిభాసిత దిగంతరాళంబును
గాంత విధుకాంత కుట్టిమాంత ర్నిరంతరతంతన్యమాన ముక్తావితాన ప్రతిబింబ
ధాళధళ్యస్ఫుట స్ఫటికశిలాసోపాన విభావిభాసమానంబును ననల్ప శిల్పకల్పనా
కల్ప వివిధగవాక్షోపలకలిత వజ్రకీలిత భిత్తికాంత ~~[illegible]~~ రధర్మ నిర్మిత ద్వారబంధ



బంధురాజిర పరిసరస్ఫురన్మణిసాలభంజికా పుంజరంజిత నీలోపలవేదికా విరాజి
తంబగు నగు చంద్రశాలాభ్యంతరంబున సౌవర్ణ సింహాసనాసీనుండై. ౧౯.

సీ. ఒకచోట సకలశాస్త్రకళారహస్య సంవాద నైపుణిగల్గు వేదవిదులు
నొకచోటఁ గావ్యనాటక చాటువాచాప్రగల్భధీచతురులౌ కవివరేణ్యు
లొకచోట వివిధనీతికలాపవిజ్ఞానమతిసమంచితులైన మంత్రివర్యు
లొకచోట సంతతప్రకటిత నిజసాహసోత్సాహమహితులౌ యోధవరులు
గాయకులు వీరభటులు శృంగారవతులు
వందిముఖ్యులు వైణికుల్ వాంశికులును
మఱియుఁ దగువార లొకచోట మెఱసి కొలువ
నిండుగొలువుండి యమ్మేదినీ విభుండు. ౨౦.

క. నిరుపమకటాక్షవీక్షా। పరికల్పిత శిష్య సకలభాగ్య ఘన శ్రీ
తిరుమల నరహరి బుధగురు। వరసుత రామానుజార్యవర్యుని కృపచేఁ. ౨౧.

క. సరసప్రసంగగోష్ఠీ। నిరతుండై ధర్మములు గణింపుచుఁ గృతియే
స్థిరతరము తరుతటాకా। ద్యురుధర్మము లందు ననుచు నూర్జితబుద్ధిన్. ౨౨.

శా. శ్రీమచ్చంద్రకలా కిరీటపద రాజీవద్వయీభావనా
సామర్థ్యోదిత వాక్ప్రపంచఘటనాచాతుర్య విద్వజ్జన
స్తోమానందద శేముషీ నిజకలాసు న్వక్కలంకాన్వయుం
బ్రేమాత్యాస్పదు వీరభద్రుని ననుం బిల్పించి యుప్పొంగుచున్. ౨౩.

క. తాతలతరముననుండియు। నీతని జనకుండు మనకు హితుఁడు కవీంద్రుం
డీతనిచేతను గృతివి। ఖ్యాతిగఁ గైకొందుననుచు హర్షంబొదవన్. ౨౪.

గీ. సవినయంబున సముచితాసనమునందు। నంతికంబునఁ గూర్చుండ నాజ్ఞయొసఁగి
మందహాసాంచిత ముఖారవిందుఁడగుచు। సతిదయాస్ఫూర్తి నిట్లని యానతిచ్చె.

క. శ్రీవెలయనుభయభాషల। నీవలెఁ గృతిసేయఁగలరె నేఁటికవీంద్రుల్
భూవిశ్రుత కవితా వి। ర్భావ యశస్సాంద్ర వీరభద్రకవీంద్రా. ౨౬.

సీ. మీతాత లోకవిఖ్యాత భాషాబలశేషాహి యా చంద్రశేఖరుండు
మీతండ్రి చాటుగాథాతత చిత్రప్రబంధకల్పనశాలి భాస్కరుండు
మీతల్లితండ్రి పురాతన సత్కవినాథులకెన విశ్వనాథసుకవి
మీమేనమామ సుత్రామవైభవుఁడు సత్యాఃకృతిమతి వేంకటాద్రిసుకవి
చదువకే శ్రీసతీశప్రసాదగరిమ। బాల్యమున నే కుమారసంభవముఁ దెనుఁగుఁ
జేసి కవులెంచఁ బ్రఖ్యాతిఁ జెందితీవు। కలరె నీసము లాధునికులు కవీంద్ర.

ఉ. అత్యలఘుక్రియానిపుణుఁడై ధరణీతలమేలు విక్రమా
దిత్య సభాస్థలంబునఁ బ్రతిష్ఠితుఁడై ఘనధీసమగ్రతన్
సత్యవతీ తనూభవునిజాడఁ బ్రసిద్ధికినెక్కి నవ్య సా
హిత్యమునన్ సుబంధు సుకవీంద్రుఁడు ప్రస్తుతిఁగన్నవాఁడిలన్. ౨౮.

గీ. ఘనతరమనీష నమ్మహాకవివరుండు । ప్రతిపదశ్లేష గద్యప్రబంధ మత్యు
దారగతిఁజెప్పె వాసవదత్తయనఁగ । నార్యు లాకథ కడుఁ జోద్యమనిరి సభను.

మ. స్తవనీయంబగు తత్కథాక్రమము భాషాయోషిదంఘ్రి స్ఫుర
న్నవమంజీరనినాదమేదుర నితాంతప్రౌఢ వాగ్గుంభవ
ద్భవదీయోక్తుల నాంధ్రకావ్యముగ వైదర్భిగతింగూర్చు త
త్కవినవ్యోక్తులు గొన్ని నీకవితకున్ గైదండగావింపఁగన్. ౩౦.

క. వరమతి వాసవదత్తా । పరిణయమనఁజెప్పి యీ ప్రబంధము విద్వ
త్పరిగణ్యంబుగ మాకుం । దిరముగ నంకితముసేయు ధీరవిచారా. ౩౧.

వ. అని సబహుమానంబుగా మణిమయభూషణ కనకాంబర కర్పూరతాంబూలాదు లొసంగిన నంగీకరించి మత్కృతి కన్యాలలామంబునకు ననురూపంబగు నాయక రత్నంబుఁగల్గెనని సంతసించి యమ్మహామహుని వంశావతారక్రమంబభివర్ణించెద.

చ. హరిహయపద్మసంభవ ముఖామరకోటి కిరీటకోటి భా
సురహరినీలభృంగ పరిశోభితమై సనకాది మానసాం
తర పరివర్ధమానమయి తాపసహంస సమాశ్రయంబునై
హరిపద నీరజాత మలరారు సమస్తజగత్ప్రసిద్ధమై. ౩౩.

గీ. అట్టి హరిపాదపంకేరుహంబువలన । సంభవించెను గాంభీర్యశౌర్యధైర్య
కార్యచాతుర్య సౌందర్య ధుర్యవిలస । దనుపమకులంబు పద్మనాయకకులంబు.

చ. రుచిర హరిద్వధూజనశిరోజ విరాజదురోజమండలీ
విచికలమంజరీ ఘుసృణ విభ్రమవిభ్రమ కృద్విభావళీ
సుచిరయశఃప్రతాప పరిశోభితమై ఘనదానవిక్రమ
ప్రచురతఁ బద్మనాయకకులం బలరారు జగత్ప్రసిద్ధిగన్. ౩౫.

వ. అందు. ౩౬.

క. శ్రీభజనీయంబై ధర । ణీ భూషణమగుచు సత్త్వనిలయాభిఖ్యా
శోభితమై క్షీరాంబుధి । వైభవమున మెఱసి రావు వంశంబలరున్. ౩౭.

ఉ. రావుకులాంబురాశికిఁ దరంగములెంచినరీతి నందఱన్
నావశమే గణింపఁ గృతినాథునిసంతత సంతతిక్రమం



బే వివరింతు భాగ్యసముపేత మనోహరహారవల్లరీ
పావనరత్నపంక్తిఁ దగుభంగి గణించినజాడ నియ్యెడన్. ౩౮.

ఉ. సారవిచారు లార్యజనసమ్మతు లాహవశూరు లర్థిమం
దారు లవార్యవిక్రము లుదారులు మానవతీ మనోహరా
కారులు వర్ణనీయగుణగణ్యచరిత్రులు దుష్టశత్రుసం
హారులు రావు సత్కులమునం దుదయించినవారలందఱున్. ౩౯.

వ. వారిలోన. ౪౦.

మ. నలమారాకృతి కాకతీంద్ర జయసంధానైక ధౌరేయుఁ డు
జ్జ్వలతేజోబలభాసమానుఁడు జగత్ప్రఖ్యాతచర్యుం డనా
విల బేతాళ కృపాత్తవైభవుఁడునై బేతాళ రాణ్మేదినీ
వలయాధీశ్వరశేఖరుం డలరుఁ దద్వంశాగ్రగణ్యస్థితిన్. ౪౧.

క. అతనితనూభవుఁడై సం । తత దానకలాకలాప దక్షుండగుచున్
నుతగుణుఁడగు పెదసింగ । క్షితిపతి వైభవముగాంచి చెలఁగుచునుండెన్.

సీ. అయ్యెడ సూర్యవంశాంభోధిచంద్రులై విక్రమక్రమలీలవెలయు నుదయ
పురపు రాణ్ణావారి వరకుటుంబంబులోనుండి వెల్వడి మహాద్దండశక్తిఁ
బూసపాటి కులోద్భవుండైన మాధవవర్మయ న్వసుమతీవల్లభుండు
విపులసైన్యముతోడ బెజవాడచెంత నప్పెద్దసింగక్షమా విభువరేణ్యు
సురపురీవరసౌఖ్యభాసురునిజేసి। జైత్రయాత్రాభిలాషచే సరవి నాతఁ
డానిగొండిపురాది గోత్రాధిపతులఁ । బటుతర భుజాబలానూన పటిమ గెలిచి.

క. అజచంద్రపయోరాశి । ద్విజరాజుల హాణశకము వెలసెడు నెడఁద
ద్విజయస్తంభచయంబుల । నిజకీర్తులెసంగ నచటనిలిపెం గడిమిన్. ౪౪.

క. మరియు ననేకమహీశుల । దురమునఁ దునుమాడి విజయదుందుభు లెసఁగన్
వరరామేశ్వరనగరీ । పరిసరమున కేగి మరలివచ్చెదునంతన్. ౪౫.

చ. వరయశుఁడైన సింగవిభు పట్టపుభామిని యంతకంటె మున్
బరువడి చూలుదాల్చుటను బ్రాణ విభూత్తముతోడఁబోక బం
ధురతరువార ఘోరమృగ దుర్గమ కానన మండలంబులన్
సరగున నేగియేగి యొకచారుతరంబగు నగ్రహారమున్. ౪౬.

గీ. భువనగిరిచెంతఁ గనుఁగొని భువనవిదిత । వేదవేదాంగ వేదియౌ వింజమూరి
కులజుఁడైనట్టి నరసన్నగురునివలన।బహుకృపాస్ఫూర్తిఁగాపాడఁబడుచునుండె.

క. ప్రకటపరాక్రమ జితరిపు । నికరుండగు మాధవాఖ్యనృపమౌళి మహో
త్సుకవృత్తిం గర్ణా । కర్ణికఁ దెలిసికొనెం దదీయవృత్తాంతంబుల్. ౪౮.

చ. తెలిసి తదగ్రహారము నతిత్వరితంబుగఁ జేరి యాతఁ డ
చ్చెలువ వధూపఁబూనఁగ నృసింహబుధుండు మదీయ పుత్రికా
తిలకమటంచు నిశ్చలమతిన్ శపథోక్తులుపల్కి నేమియున్
దలుపఁగలేక వెండియును జయ్యననేగ స్వకీయపద్ధతిన్. ౪౯.

క. అంత నొకనాఁడు రిపుదు । ర్దాంతబలుండైన పుత్రరత్నంబును ద
త్కాంతా జనత్వామణి య । త్యంత శుభాకరముహూర్తమందుం గనియెన్. ౫౦.

క. అతనికి ననపోత మహీ । పతియను నామంబునుంచి భాసురవిద్యా
చతురునిఁ జేసె నృసింహ । క్షితిసురమణి గనికరంబు చెన్నువహింపన్. ౫౧.

సీ. సంగీతసాహిత్య సకలవిద్యాప్రౌఢి నురుతర శస్త్రప్రయోగపటిమ
వాహనవారణారోహణైక నిరూఢిఁ బటుబాహుబలశౌర్య పటిమ నలరి
వైరులసాధింపఁ బగఁబూని యుత్సాహలీల నద్యోడమహమ్మ్యలనంగఁ
జెలఁగు నచ్ఛిద్రకర్ణుల సహాయతనొంది వెండియు నురుధాటి విజయవాటిఁ
గరము భీకరమైన సంగరమొనర్చి । యరిమహీపాలవరు ససైన్యముగఁ దునిమి
విశ్వవిశ్వంభరాధీశ వినుతమైన । విజయమును గాంచె ననపోత విభువరుండు.

చ. మదనసమానమూర్తి రిపుమర్దన కృద్ఘన విక్రమక్రమా
స్పద కరవాల భైరవుఁ డభంగుర నిస్తులవైభవక్షమా
ఖిదురకరుండు దుష్టజనభీషణ భాషణ భూషణాంకుఁ డ
భ్యుదయము గాంచి మించె ననపోతమనీఁడు మహిం బ్రసిద్ధుఁడై. ౫౩.

క. వేలాధిక నిజభటపటు । కోలాహలమొసఁగఁ దనదు ఘోటకమాజిం
గ్రాలఁగ ననపోతక్ష్మా । పాలకుఁడు రణంబుసలిపె భాసురలీలన్. ౫౪.

గీ. ఆ మహారాజుతనయుఁడై ఖ్యాతిగాంచి । నెగడె సర్వజ్ఞసింగమనీఁ డనూన
మానఘనదాన సప్తసంతానమాన । నీయ వైభవగుణవర్ణనీయుఁడగుచు. ౫౫.

సీ. అరిపురభంజనస్ఫురణచే నలరారి యసమాంబకాకృతి నతిశయిల్లి
ఘనసారలసదభిఖ్యా సమగ్రతఁగాంచి యతను విభూతిసంగతిని మెఱసి
చంద్రఖండకిరీట శాశ్వతప్రభమీఱి తతబుధవాహినీ ధృతిఁ జెలంగి
పద్మబాంధవతనూభవదానధృతిఁ జెంది యచలసద్ధర్మ విఖ్యాతినలరి
యవనితలమున సర్వజ్ఞుఁడనఁగ నెగడె । భాసురాచార శాంభవాగ్రేసరుండు
రావుకులవారిరాశి కైరవహితుండు । ప్రథనజయశాలి సింగభూపాలమౌళి. ౫౬.



క. అతనిసోదరుఁడన వి । ఖ్యాతిం దనరారె సద్గుణాకరుఁడు ధరి
త్రీతలపతి మాధవనీఁ । డాతత పరవాహినీ కృతాంతుండగుచున్.

సీ. అనుదినంబును వైష్ణవాభ్యర్చనముఁ జేసి యగ్రహారములు బ్రాహ్మణులకొసఁగి
వివిధపురాణార్థ వివరణంబొనరించి దేవాలయంబుల శేవనిలిపి
గోపకన్యాభుజంగునిఁ జిత్తమున నుంచి ధర్మగుణంబుపైఁ దలఁపునిలిపి
సత్యవర్తనము విశ్వసనీయమని పూని శ్రితులైనవారి వాంఛితములొసఁగి
యంత్యమున యోగమహిమ దేహంబుఁదొఱఁగి । రభసమున నంత శ్రీరంగవిభునిచెంత
నిలిచియున్నట్టి మాధవనీని నెన్న । నలవియే బ్రహ్మకైన శేషాహికైన. ౫౮.

చ. స్మరనిభమూర్తి రావుకులమాన్యుఁడు మాధవనీఁడు జంబుకే
శ్వరుగుడిదాఁకఁ బాశుపతసైన్యముఁ దాఁకఁగఁదోలి రంగమం
దిరమున కింగణస్థల ముదీర్ణముచేసిన పౌరుషంబు సు
స్థిరముగనున్న దేకద తదీయశిలాక్షరశాసనాంకమై. ౫౯.

క. ఘనమతులా నరవరునకుఁ । దనయులు పెక్కండ్రు పుట్టి తారును గులపా
వనులై పుత్రులఁ గాంచిరి । వినకరిరమె వారు భువిని వెలసిరి కీర్తిన్. ౬౦.

క. ఘోటీరథకుంజరభట । కోటీ హితవిభవులగుచు గుణమణిభూషా
పేటీ సన్నిభులై వెలు । గోటీపుర నిలయులైరి కొందఱు కడిమిన్. ౬౧.

వ. అందు. ౬౨.

శా. బంగాళాంగ కళింగ వంగ శక నేపాళాది రాజ్యంబులన్
రంగత్కీర్తులుగాంచి శాత్రవులఁ బోరన్ సౌరవాణాంగనా
సాంగత్యంబుననుంచి భూభరణ దీక్షాదక్ష దాక్షిణ్యుఁడై
రంగారాయఁడు రావువంశభవుఁడై రాణించె భాగ్యోన్నతిన్. ౬౩.

క. చతురుఁడు రంగారాయ । క్షితిపతి యవనులజయించి చిరకీర్తి సమం
చితుఁడై నిజభుజశక్తిన్ । మెతుకున్ శైలాసకోట మేటిగఁ గొనియెన్. ౬౪.

గీ. ఎంచఁదగు రంగరాయ పృథ్వీశ్వరునకు । లలితసుగుణావలంబయౌ లచ్చమాంబ
కును సముద్భవమయ్యె వైకుంఠభక్తి । సహితుఁడగు ధర్మరాయ భూజనవిభుండు.

క. ధర్మాద్రి తుల్యధైర్యుఁడు । నిర్మలతరకీర్తి వర్ణనీయమహీభృ
ద్ధర్మప్రవర్తనుండగు । ధర్మారాయప్రభుండు దగు నుతియింపన్. ౬౬.

క. శ్రీదయితావరకరుణా । త్పాదిత ధనధాన్యధేను భాగ్యోదయ స
మ్మోదునకు ధర్మవిభునకు । మాదాంబకు లచ్చనృపతిమణి జనియించెన్. ౬౭.

గీ. ప్రచురతర పాండుకీర్తి సంపాదకుండు । నతుల భీమబలుండు సత్యాదరుండు
ద్రుపదసంతాన సత్కృతి ధూర్వహుండు । ధర్మజుండన లచ్చభూధవుఁడు దగఁడె.

సీ. తత నవరత్న నూత్నప్రభాశోభిత తపనీయదండ విస్తారితంబు
శేఖరాలంకృతాంచిత మణికుంభ దీధితి విభాసిత చతుర్దిక్తటంబు
ప్రాంతలంబితకూల భంగానుకృతవియద్గంగాతరంగ శంకాపదంబు
శ్రీ విరాజితతాప హృన్నిర్మలాయతచ్ఛాయావితాశ్రిత జనపదంబు
నగుచుఁ దనయాతపత్రంబు జగతి మెఱయ
గజపతికిఁ బ్రాణసఖుఁడగుఁ ఖ్యాతిగాంచెఁ
గవిజనాఖిల బాంధవకల్పశాఖి
జననుతుండగు లచ్చరాడ్జనవిభుండు. ౧౯.

చ. అతనికిఁ గొండమాంబయను నంగనకుం జనియించి రారయ
ప్రతిములు పుత్రరత్నము లరాతి భయంకరు లార్యలోక స
మ్మతుఁడగు ధర్మభూభుజుఁడు మాధవరాయఁడు వేమధారుణీ
పతియుఁ ద్రిమూర్తులట్ల క్షితిభారముఁబూని మహోన్నతస్థితిన్. ౨౦.

శా. క్షీరాంభోనిధి కుందబృంద సితరాజీవామరాహార నీ
హారక్ష్మాధరహారహీర రజతాహార్యాభ్రికల్లోలినీ
సారక్ష్మారుహచంద్రసైంధవ విభాసారంబులం గేరు ధ
ర్మారాయ ప్రభుకీర్తిచంద్రిక లుదార స్వప్రకాశంబునన్. ౨౧.

ఉ. మాధవరాడ్గ్రగణ్యుఁడు సుయోధన సన్నిభమానశాలి యా
యోధనసవ్యసాచి రిపు యుద్ధవినాశనదక్షుఁ డార్యసం
బోధిత సత్కళాశ్రయుఁడు భూధరధీరుఁడు సాధుశీలుఁ డ
మ్మాధవరాయ సత్ప్రభుఁ డుమాధవభూతిసమేతుఁ డెంచఁగన్. ౨౨.

క. సోముఁడు విభూతిగరిమన్ । సోముఁడు దాతృత్వమహిమ సుత్రాముఁడు భా
గ్యామిత భోగనిరూఢిన్ । వేమారాయప్రభుండు వినుతింపఁదగున్. ౨౩.

వ. అందు. ౨౪.

ఉ. మాధవరాయచంద్రునకు మానవతీమణి గుర్వమాంబకున్
భూధరధీరులై తగు సుపుత్రులు నల్గురు కల్గి రెన్నఁగా
సాధువిధేయుఁడౌ గురవశౌరి ఘనుండు తెనుంగురాయఁడున్
శ్రీధరసన్నిభుండు నరసింహుఁడు ధన్యుఁడు రంగశాయియున్. ౨౫.

వ. అందగ్రజుండు. ౨౬.



శా. సర్వజ్ఞ ప్రతిమానుఁడై నిజభుజాస్తంభాగ్రభాగంబునం
దుర్వీచక్రము దాల్చి శత్రువరుల న్యుద్ధస్థలిం ద్రుంచి స
ద్గుర్వాజ్ఞావశవర్తియై విబుధసద్గోష్ఠీనుతోద్యోగుఁడై
గుర్వారాయఁడు ఖ్యాతిగాంచె భువి లోకుల్మెచ్చఁ దేజంబునన్. ౨౭.

సీ. బాంధవచాతక ప్రతతికిఁ దన ఘనోదయము సంతతఘనోదయము గాఁగ
విమత గర్వాంధకారమునకుఁ దన ప్రతాపంబు రవిప్రతాపంబు గాఁగ
వివిధయాచకభృంగ వితతికిఁ దన దానధార యూథపదానధార గాఁగ
రణధరాస్థిర సురరాజికిఁ దన సుధర్మాప్తి సంతత సుధర్మాప్తి గాఁగ
క్ష్మాతలంబునఁ బేరు ప్రఖ్యాతిగాంచి । ఖడ్గనారాయణాంక సంగతినిఁ దనరె
ఘనుఁడు మాధవరాయశేఖరుని సుతుఁడు । విప్రసులభుండు తెనుఁగురాయప్రభుండు.

సీ. తమకించుఁ దమకింపనుఁ దన మెఱుంగని మన్నెరాజుల రాజుల ప్రతిభ చెఱుపఁ
జెండాడుఁ జెండాడు చెలువు దోఁపఁగ డాసి మత్తారి భూమిభృన్మస్తకములు
కలనైనఁ గలనైనఁ గదలని మన్నీల చెదరించి పావలలో నుదుగఁ జేయుఁ
గడనుండుఁ గడనుండు పడఁతులకుం బలె భీతులై చను శత్రుబాలములకు
గోత్రభిత్క్రూర శతకోటి కోటిసార । సారసప్రియఖరకరోదారరీతి,
సమరఖ్యాతిగాంచె నౌనమదరాతి । వరవిభూతి తెనుంగు భూవిభుని హేళి. ౨౯.

గీ. అర్థులకుఁ గామితార్థంబు లందఁజేసి । యవనిఁ బాలింపఁ దనయులకాజ్ఞ యొసఁగి
యంతమున నీలగిరిని దేహంబు బాఁచెఁ । దెనుఁగురాయని వినుతింప నలవియగునె.

చ. శతధృతియున్ ఫణీంద్రుఁడును సారగురుండును శైలకన్యకా
సుతుఁడును సాటివత్తురనుచు న్వినుతింతురుగాక రాజులీ
క్షితి జతసేయ నర్హులె విశేషతరస్ఫుట వాగ్విభూతిచే
శ్రితసురశాఖి రావు నరసింహనృపాలక చక్రవర్తికిన్. ౩౧.

క. నీతియుఁ బౌరుషము మదా । రాతి విదారణము శిష్టరక్షణమును బ్ర
ఖ్యాతియు హరిపదభక్తియుఁ । జాతుర్యము రంగశాయి సహజగుణంబుల్. ౩౨.

క. ఘనుఁడగు రంగమహీశున । కును గుణవతి కోనమాంబకును జననంబై
రనఘుల్ రామన్నయు స । జ్జనుఁడగు నీలాద్రిరాయ జనపాలుండున్. ౩౩.

వ. అందు. ౩౪.

క. రామాకామేయుండై । రామాంఘ్రి సరోజభక్తిరతుఁడై విబుధా
రామవసంతుండై ధర । రామారాయప్రభుండు ప్రస్తుతిగాంచెన్. ౩౫.

సీ. శత్రునుంచఁడుగదా క్షమలోన క్షమలోన విడువనొల్లఁడుకదా వేల్పైనఁ
బలికి బొంకఁడుగదా కలనైనఁ గలనైన వెన్నుఁజూపఁడుగదా యెన్నఁడైన
మాయఁజేయఁడుగదా మదినైన మదినైనఁ గోపముంచఁడుగదా కుమతులరసి
కాలుదప్పఁడుగదా కరమెత్తి కరమెత్తి యీఁగిమానఁడుగదా యెట్టియెడల
నీ ధరాపాలుఁడని లోకులెన్నుచుండ । బాల్యముననుండి కీర్తిచేఁ బ్రబలెనార
ఖ్యాతచరితుండు రంగభూకాంతసుతుఁడు। భావజనిభుండు నీలాద్రిభూవిభుండు.

మ. అనఘప్రాభవుఁడై తనర్చు నరసింహక్షోణిభృన్మౌళికిన్
వినతారాతి జనాంగనా వితతియౌ వెంగాంబకుం బుత్రులై
జననంబందిరి చిన్న భూవిభుఁడు భాషాచాతురీధూత వా
క్పణి నీలాద్రివిభుండు రామధరణీకాంతుండు నా ముగ్వురున్. ౮౭.

వ. అందు. ౮౮.

ఉ. పున్నమనాఁటిచందురునిఁ బోలుఁ బ్రశస్తకళాధురీణతన్
బన్నగరాజుఁబోలుఁ బటుభాషణమంజుల ధీసమగ్రతన్
వెన్నునిఁబోలు సత్త్వగుణ విశ్రుతి వైఖరి నెంచిచూచినం
జిన్నమరావుతోడ జతసేయఁగ నన్యమహీశు లర్హులే. ౮౯.

క. హాలాహలశిఖి కీలా । భీలారిచమూహృదబ్జభీకరలీలా
ఖేలాంచిత కరవాలుఁడు । నీలాద్రివిభుఁడు వర్ణనీయుం డెపుడున్. ౯౦.

సీ. విమలామృతోదయోద్యమనిరూఢిఁ జెలంగి కువలయప్రియ మహోత్సవము గాంచి
కమలాభినవజన్మకారణంబున హెచ్చి వరబాడబాప్తజీవనత నలరి
లావణ్య గణ్య లీలావిభూతిఁ జెలంగి రత్నాకరోత్తమ ప్రభవహించి
భూమిభృద్రక్షావిభూతిచే నలరారి సుమనోమనోజ్ఞవిస్ఫూర్తి నలరి
కొమరగిరివరపురమునఁ గొమరుమిగులఁ
గడలికెనయైన ఘనతటాకంబు నిలిపె
ఘనుఁడు నరసింహభూనాయకుని సుతుండు
రమ్యగుణశాలి నీలాద్రిరాయమౌళి. ౯౧.

క. వరమతియగు నీలాద్రికి । నరయఁగ గేసాంబకును నిజాత్మజులై రా
నరసన్నయు బుచ్చన్నయు । సరసుఁడు వెంకన్న చిన్నజనపాలుండున్. ౯౨.

వ. అందగ్రజుండు. ౯౩.

సీ. అసమాంబకుఁడు మానితైశ్వర్య మహిమచే నసమాంబకుఁడు సురూపాప్తిచేత
ద్విజరాజు విమలకాంతి ప్రకాశంబుచే ద్విజరాజు నుతజవాధికతచేత



పద్మాప్తుఁ డుద్యత్ప్రభామహత్త్వంబుచేఁ బద్మాప్తుఁ డతిసత్త్వపరతచేత
జీమూతగురుఁడు రాజితదానగుణముచే జీమూతగురుఁడు సుస్థిరతచేత
ననుచు సుకవీంద్రులెల్లఁ దన్నుఁ బ్రస్తుతిసేయఁ। బద్మనాయకవరులలోఁ బ్రతిభ గాంచె
కీర్తిఁ గనుపట్టి నీలాద్రిరావుపట్టి । సుప్రభుండౌర నారసింహప్రభుండు. ౯౪.

మ. ఘనుఁడౌ రావు తెనుంగురాయనికి లోకస్తుత్య సేనాంబకుం
దనయుల్గల్గిరి మాధవప్రభుఁడు సన్మాన్యుండు వెంకన్న స
జ్జనుఁడౌ చిన్నమరావు లోకనుతుఁడౌ చంద్రక్షమాభర్త జ
గ్గనృపశ్రేష్ఠుఁడు కృష్ణరాయఁడును బోకన్ రంగశాయీంద్రుఁడున్. ౯౫.

క. గురవారాయమహీంద్రున । కిరువురు సతులలరుదురు మహీరమణియు నా
సిరియును బలెఁ గులపావన । లరయన్ భద్రాంబ లచ్చమాంబయనంగన్. ౯౬.

క. అతనికి భద్రాంబకు సుతు । లతులమతుల్గలరు మాధవాఖ్యుఁడు లక్ష్మీ
పతి రామన్నయు రెండవ । సతికిన్ సీతన్నయనఁగ సరసగుణాఢ్యుల్. ౯౭.

వ. అందగ్రజుండు. ౯౮.

సీ. అడుగఁడెవ్వరిఁజేరి యడిగెనా శాస్త్రార్థ మవనీసురశ్రేణి నడుగుఁగాని
కొలువఁడెవ్వరినైనఁ గొలిచెనా మదిఁబొంగి గోపాలబాలునిఁ గొలుచుఁగాని
మ్రొక్కఁడెవ్వరికైన మ్రొక్కెనా బ్రాహ్మణముఖ్యులకే సాగి మ్రొక్కుఁగాని
కోరఁడేకోరిక కోరెనా ధర్మంబు కొనసాగవలెనని కోరుఁగాని
యవనిలోపలఁ బద్మనాయకులలోనఁ । బొగడనెగడె లసద్గుణభూషణుండు
వినయసహితుండు గుర్వరాయనిసుతుండు। మానధుర్యుండు గద రావుమాధవుండు.

గీ. సుప్రభుండగు నమ్మాధవప్రభునకు । నంగనామణియై తగు రంగమాంబ
కును సముద్భవులైరి సద్గుణులు సుతులు । ధారుణీ భార ధౌరేయ సారమతులు.

సీ. సర్వసర్వంసహా ధూర్వహణక్రియాఖర్వదోర్విభవుండు గుర్వశౌరి
యాయోధనస్థలీ స్వాయత్త విజయగాంగేయుండు తిరుపతిరాయవిభుఁడు
రంగేశపాదాబ్జ భృంగాయమానాంతరంగవిఖ్యాతుండు వెంగళన్న
సీమంతినీమనః కామితాకార రేఖామనోజాతుండు రామనృపతి
ప్రభువరేణ్యుండు తిరుమలరాయవిభుఁడు। భాగ్యవంతుండు వేంకటపతిఘనుండు
భవ్యగుణశాలి తిమ్మభూపాలమౌళి । యనఁగఁ గులగిరులట్ల విఖ్యాతితోడ. ౧౦౧.

క. చతురమతు లతిదయాపరు । లతులపరాక్రములు సజ్జనావన్నులు దయా
న్వితులు సురద్రుమ సన్నిభ। వితరణులు తెనుంగు రాయవిభుని కుమారుల్. ౧౦౨.

వ. వారిలోన. ౧౦౩.

క. బాధించెను శాత్రవులను । సాధించెను విద్యలెల్ల శశ్వద్గతి నా
రాధించెను లక్ష్మీశుని । మాధవరాయనికి సములు మహిలోఁ గలరే. ౧౦౪.

ఉ. శ్రీధరునాజ్ఞదప్పినను వృత్రహు వజ్రము దారిదప్పినం
భూధరముల్ చలించినను భూమి వడంకిన మేరదప్పి యం
భోధులు ధాత్రిఁబర్విన భూపతి పూజ్యుఁడు రావు ధన్యుఁడౌ
మాధవరాయ చంద్రుని సమంచితసత్యుని మాటదప్పునే. ౧౦౫.

చ. కుటిలమదారివర్గములఁ గూల్చెఁ గవీంద్రులఁ బ్రోచె నాగరీ
కటక కళింగ కేరళ శక ద్రవిడేశ సభాంతరంబులం
బటుతరకీర్తిచంద్రికలు పర్వఁగఁ బ్రస్తుతిఁ గాంచె రావు వేం
కటపతిరాయచంద్రుఁడు జగన్నుత శాశ్వతకీర్తిశాలియై. ౧౦౬.

క. మన్నెధరాధ్యక్షులచే । మన్నన నైశాని సమగ్రమాన రమాసం
పన్నుండై యలరారుం । జన్నారాయప్రభుండు చిరతరకీర్తిన్. ౧౦౭.

సీ. ప్రకృతిరంజనముచే భరతక్షమేశుం డ్వుమేశుండు లక్ష్మీసమృద్ధిచేతఁ
దతభూతిచే ధరాధర సుతాకాముండు కాముండు సౌందర్యగరిమచేతఁ
గాంభీర్య గుణసమగ్రత రమాజనకుండు జనకుండు సుజ్ఞానఘనతచేత
నుతసుధీ వైభవోన్నతిఁ బన్నగరాజు నగరాజు ధృతిలసన్మహిమచేత
సీఘనుండని సుకవీంద్రు లేపుమీఱఁ । దన ప్రభావంబు వర్ణింపఁదనరె నార
యనఘచరితుండు తెనుఁగురాయని సుతుండు । దర్పకనిభుండు రామచంద్రప్రభుండు.

సీ. వేమాటు కచ్ఛపవిభునకు నిందిరాసుదతికిఁ దనయొమ్ముఁ జూపఁగలిగె
నరపది మోములయ్యకు వేడ్కఁ రంజిల్ల బంగారువిల్లు చేపట్టఁగలిగె
నలవేయికన్నుల బలువజీరునకుఁ జేరెలమిఁ జౌదంతిపై నెక్కఁగలిగెఁ
జలువరాయనికి నిచ్చలు ప్రాణసఖితోడఁ దలయెత్తి ముచ్చట దెలుపఁగలిగె
రావువంశోద్భవుండైన రామచంద్ర । రాయదేవేంద్రుఁ డెలమిఁ దిరంబుగాఁగ
నిజభుజాస్తంభమున ధారుణీభరంబు । ఘనతరస్ఫూర్తిఁ దాల్చుట కతన నవుడు.

సీ. అతఁడు గోత్రవిపక్షుఁ డితఁడు గోత్రసపక్షుఁ డతఁడు భోగంబుచే నితని సరియె
యతఁ డరి శ్రీకరుం డితఁ డరిభీకరుం డతఁడు తేజంబుచే నితని సరియె
యతఁడు జిష్ణుగధారి యితఁడు జిష్ణుగవైరి యతఁడు విభూతిచే నితని సరియె
యతఁడు బాడబభృతుం డితఁడు బాడబహితుం డతఁడు గంభీరత నితని సరియె
యనుచు విభవప్రతాప భూత్యతిగభీర । గరిమ భావించి శక్ర పంకరుహమిత్ర
భవ సముద్రుల నెంతురౌ ప్రతిదినంబు । రామచంద్రుని వర్ణించు భూమిపతులు.



గీ. రావువంశాబ్ధిచంద్రుఁడౌ రామచంద్రుఁ
డవనిఁ బాలింప దారలు బాంధవులు సిరులు
గాంచిరన సంశయంబేల కరులు గిరులు
హరులును సుఖింప సుఖవృత్తి నరులకరుదె. ౧౧౧.

క. ఆ రామచంద్రరాయ । క్ష్మారామావల్లభునకు సహధర్మిణియై
శ్రీరమ్యాకృతినలరెం । ధీరస్తుతగుణకదంబ తిమ్మాంబ ధరన్. ౧౧౨.

సీ. అన్నదానోన్నతి నన్నపూర్ణాదేవి భూరిక్షమాఖ్యాతి భూమిదేవి
యైశ్వర్యమహిమచే నాది లక్ష్మీకాంత చారువాక్ప్రౌఢిమ శారదాంబ
పతిపాదభక్తి సంగతిచే నరుంధతి చిరభోగగరిమ శచీమృగాక్షి
సత్యపాలనలీలఁ జంద్రమతీదేవి యతులరూపమున రత్యంబుజాక్షి
యీ సతీరత్నమని లోకులెన్నుచుండఁ । బ్రబలె గజరావుతిమ్మన్నపట్టి రావు
రామచంద్రప్రభూత్తము రాణి భూమి । దివిజనుత సద్గుణకదంబ తిమ్మమాంబ.

సీ. శ్రీమనోహరుఁడు కుంతీమాధవస్వామి కులదైవమే నృపకుంజరునకుఁ
బృథివి నెన్నికయైన పీఠికాపురి రాజధాని యే సంతతధార్మికునకు
బారుహమన్నె భూపాలకు లాజ్ఞలో మెలఁగుదు రేమహీతలవిభునకు
రణరంగ విజయసంరంభ జృంభణలీల సహజమే శాత్రవసంహరునకు
నతఁడు నుతిసేయఁదగుఁ గోసలాంగ వంగ । మగధ కర్ణాట నృపసభామధ్యవర్ణ
నీయ గుణమణిగణ రమణీయమూర్తి । జగ్గరాయప్రభుండు భాస్వత్ప్రభుఁడు.

సీ. అలవేల్పుతోఁటపువ్వులుగాని చెలరేఁగి యేలా నికుంజాళి నీగియాగి
యనిదిండితపసిరాయని కడ్డమై యాగి తేటవేలుపు లేటి నీటఁదోఁగి
జేజేల తిండికిఁ జేరి పైపైమూఁగి వెలిమావుపై నెక్కి విఱ్ఱవీఁగి
చౌదంతికొమ్ములమీఁద నుయ్యాలలూఁగి యంచబోదలను లాలించసాగి
కడఁకతోడుత సకలలోకములయందు । మించి విహరించి ప్రఖ్యాతిగాంచె నార
చంద్రికాస్ఫూర్తి శరదభ్ర సదృశమూర్తి । రావు జగ్గక్షమాతల ప్రభుని కీర్తి.

గీ. ఆసగాంచియుఁ గృశియించి యప్పులిచ్చి । ధనదరాజ ఘనాఖ్యలఁ దనరువారు
సములె దాతృత్వమున రావు జగ్గరాయ । నృపతి కతుల మహాదానవిపులమతికి.

సీ. తనవంశధర్మంబు దనవంశధర్మంబురీతి నుద్యద్గుణ ఖ్యాతినలరఁ
దనపరాక్రమలీల తనపరాక్రమలీలగతిఁ బరక్ష్మాభృదీడ్యత వహింపఁ
దనదానవిస్ఫూర్తి తనదానవిస్ఫూర్తికరణి దోషాకరగర్వమడుపఁ
దనసదయోద్వృత్తి తనసదయోద్వృత్తిపగిదిని వాహినీ ప్రభుతఁ దెలుపఁ

దనరె ననితరదానవిద్యావివేక । శౌర్యగాంభీర్యసౌందర్య సాహసౌంకుఁ
డార్యవినుతుండు తెనుఁగురాయనిసుతుండు। ఘనవిభాహేళి కృష్ణభూకాంతమౌళి.
గీ. ఎంచఁ జిత్రంబు కడు రావు కృష్ణరాయ । శౌరి దానంబు మిత్రులు శాత్రవులును
స్వస్థులై కనకాంకిత సదనులైరి । సర్వసముఁడనఁగా రాదె యుర్వినతని. ౧౧౯.
సీ. తతకాంతివిభవ నిర్జిత నిశాకాంతుండు వరసుకవివ్రాత వనవసంతుఁ
డతివైభవాధరీకృత మరుత్వంతుండు లలితలావణ్య లీలాజయంతుఁ
డబ్జాక్షపాదపద్మాంకితస్వాంతుండు లక్ష్మీనితాంతహేలాదృగంతుఁ
డతులప్రతాప నిర్జిత భానుమంతుండు రణరంగ మష్టశాత్రవకృతాంతుఁ
డతిదయావంతుఁ డఖిల దిగంతరాళ । సంశ్రితాశ్రితగుణ లతాజాతసితల
తాంత సన్నిభకీర్తి నితాంతకాంతి । కాంతుఁడై రంగశాయి భూకాంతుఁడలరు.
క. అందగ్రజుఁడై దనరెడు । మందరనగధీరుఁడైన మాధవనృప సం
క్రందనునకు గుణధన్యన । కుం దరుణులు జానకియును గోనాంబయునన్. ౧౨౦.
గీ. ఆవిభుం డలజానకీదేవియందుఁ । గాంచెను దెనుంగు రాయశేఖరుని ఘనుని
గోనమాంబికయందు సద్గుణుజనార్ద। నక్షమాధీశుఁ గాంచెనా నరవరేణ్య ౧౨౧.
వ. అందు. ౧౨౨.
చ. హరి గురుపాదభక్తి సుజనావనబుద్ధి విపక్షజాల సం
హరణ ధురీణతామహిమ నాశ్రితబంధుజనావనంబు సు
స్థిరముగఁ గాంచె సజ్జనవిధేయుఁడు మాధవరాయభూమి భృ
ద్వరుని తెనుంగురాయనృపవర్యుఁ డవార్య పరాక్రమోన్నతిన్. ౧౨౩.
క. దుర్దమశాత్రవ జనతా । మర్దన నిర్నిద్రజయరమా విభవోద్య
త్కూర్దనుఁడై నుతిగాంచె జ । నార్దనుఁ డిలఁ బద్మనాయకావళిలోనన్. ౧౨౪.
గీ. ప్రథితయశుఁ డా జనార్దన ప్రభువరుఁడు। ధర్మమాంబకయందు నందనునిఁ గాంచె
విష్ణుపదభక్తి విభవవర్ధిష్ణు జిష్ణు । నుష్ణకరనిభు వేంకటకృష్ణవిభుని. ౧౨౫.
చ. తిరముగ రామచంద్ర జగతీపతికిం దరుణీలలామమై
పరమ పతివ్రతామహిమ భాసురయై తగు తిమ్మమాంబకున్
గురుపరాక్రమ్యు లిద్దరు సుపుత్రులుగల్గిరి భూమిపాల శే
ఖరుఁడగు మాధవప్రభుఁ డకల్మషుఁడౌ నరసింహశౌరియున్. ౧౨౬.
గీ. రామచంద్రానుజుఁడుకృష్ణరాయవిభుఁడు। సాధుసుగుణావలంబయౌ సర్వమాంబ
యందు వేంకటరాయని ననఘశీలుఁ । దెనుఁగురాయనిఁ గాంచెనౌ వినుతయశుని.



మ. చటులారాతి తమఃపరంపరలువిచ్ఛిం దిక్కూలం దేజము
త్కటలీలంగనుపట్టె యాచకమనఃకంజాళిరంజిల్ల స
ద్భటచక్రంబులు సంతసింప జగతిన్ప్రస్ఫుత్ప్రభన్ హెచ్చె వేం
కటరాయక్షితిపాలశేఖరుఁడు విఖ్యాతోదయారంభుఁడై. ౧౨౭.
క. మహితనయోక్తియు నిజకుల । విహితాచారంబు శత్రువిదళనము దయా
సహితవ్యాపారంబును । సహజంబులు దెనుఁగురాయ జనపాలునకున్. ౧౨౮.
సీ. దానంబు మధుపసంతతికినిచ్చి మతంగజత్వంబుగనియెఁ గుంజరవరములు
ఘనులజీవనమెల్లఁ గైకొని కుధరేశ్వరాఖ్యనెన్నికయయ్యె నచలవితతి
గాలియాహారంబుగా బలిసద్మంబునందుహీనత గాంచె నల ఫణిపతి
సాకర్యమేకలక్షణమెగైకొని తుంగపదవిని వేరుండనానుగుఘృష్టి
యనుమఁ గరులనుగిరులను హరిని గిరిని । విడిచి ధరణీపురంధ్రి యేవిభునిఁ జేరె
నతఁడు నుతిగాంచు రామచంద్రావనీశ । సుతవరేణ్యుండు మాధవక్షితివరుండు.
సీ. తాతఁబెండ్లాడిన తరుణియౌననిగదా చెలఁగి భారతికొప్పవచిక్కుపఱచె
మామమామకు ముద్దుమఱఁదియౌననిగదా రోహిణీరమణుని రొమ్ముచఱచె
నల్లునియల్లుఁడౌననిగదా కలశాబ్ధిఁగనివారి పాలపాపనిహసించె
ముసలివాఁడనిచేరి వెసగ్నడింపియెగదా బలరామదేవుని వలువఁజించె
భువనవిభ్రాజదకలంక భూరివైభ । వమునవిలసిల్లి తనసాటివారినెల్ల
వాఁగల్పించి భంగించెశేవతోడ । మాధవప్రభుమణికీర్తి మంజువాణి. ౧౩౧.
సీ. అరిభయంకరమహత్తర సమాఖ్యవహించి సతతసన్మార్గసంగతిని దనరి
కువలయపాలనోత్సవ వైభవముగాంచి జైవాతృకత్వ ప్రశస్తిమెఱసి
యఖిలకళాకార ణాకారమువహించి సత్ప్రభాకరకరశక్తినలరి
సర్వజ్ఞమకుటభూషణ విభూతిఁజెలంగి వాహినీప్రియజయావహతఁగాంచి
రాజనైజక్రియాక్రమ ప్రచురమగుచుఁ । దనప్రభావంబువిలసిల్ల ధరణియందుఁ
బ్రస్తుతికినెక్కె సత్సభాభ్యంతరములఁ । బ్రబలనయహారి మాధవరాయశౌరి.
సీ. సమదదంతావళ సముదయంబులమీఁదఁ గుప్పించు సింగము కొదమభంగి
దారుణభుజగసంతతి సంతతులమీఁదఁ గవియు విహంగపుంగవునికరణి
గగనజంఘాలఖగవ్రజంబులమీఁద వడిఁజూపు బల [illegible]
జవవత్కురంగమ సంఘాతములమీఁద వా[illegible] శార్దూలమట్ల
గురుకుభృత్పక్షములఁజెండుఁ గులిశమనఁగ నరిబలంబులఁ [illegible] నాహవమున
బ్రబలధారాగ్రదళిత శాత్రవపదాతి । రా[illegible]చంద్రుని మాధవప్రభుసహోదరి. ౧౩౩.

సీ. పరభీకరంబైన వరదుర్గము ఘటించె మేటిగాఁ జామర్లకోటవద్ద
యవనప్రభునిచేత జవనాశ్వము ల్గడియారంబు గజములు నంకకొనెను
దారుహమన్నెభూపాలోత్తములు నిజాజ్ఞావశులైయుండ కీర్తినలరె
వృత్తులు గల్పించి విశ్రుతంబుగ విప్రసమితికి నగ్రహారముల నొసఁగె
శ్రీరమాధవ కరుణావిశేషలబ్ధ । వైభవంబున ధారుణీవలయమేలి
రావుకులవార్ధిసోముఁడై ప్రతిభఁ గాంచెఁ । బ్రథితయశుఁడన్న మాధవప్రభువరుండు.

సీ. శ్రీరస్తు కరవాలభైరవ ఖడ్గనారాయణ కాకతిరాయరాజ్య
సంస్థాపనాచార్య జగనొబ్బగండ గండరగండ రేచర్ల వరకులీన
ప్రతిగండభైరవ పంచపాండ్యవిభాళ యరిరాయరాయవేశ్యాభుజంగ
మండలీకరగండ గండగోపాళ యాహవభీమ రాయ చౌహత్తిమల్ల
గాయగోవాళ కేళాదిరాయ బిరుద । యనుచుఁ గైవారములొనర్తు రనుదినంబు
నతులవాక్ప్రౌఢితోడ నర్థార్థులెల్లఁ । బ్రమదమున రావు మాధవప్రభునిసభను.

క. జాపల్లి నారసింహ । క్ష్మాపతిసుత రమణమాంబికామణిని జయ
శ్రీపూర్ణమహిమ మాధవ । భూపతి వరియించె హర్షము జనులెంచన్. ౧౩౬.

సీ. ఘనసర్వమంగళాకారలీలఁ జెలంగి భూమిభృత్కన్యనాఁ బొదలుటరుదె
యతులక్షమాభిఖ్యనార్యులెన్నఁ దనర్చి వసుమతీఖ్యాతిఁ బొసఁగుటరుదె
చతురభాషావిశేషఖ్యాతిఁ దనరారి చతురాస్యకాంతనాఁ జాలుటరుదె
మాధవప్రేయసీమణియై సిరులహెచ్చి యాదిలక్ష్మీస్ఫూర్తి నలరుటరుదె
యనుచు జనులెల్ల వినుతిసేయంగఁ బ్రబలె । శైలజాక్ష్మాసరస్వతీ శ్రీలఁ బోలి
యవితవివిధార్థి నిఖిలబాంధవకదంబ । రమ్యసద్గుణనికురుంబ రమణమాంబ. ౧౩౭.

సీ. చంద్రధరస్ఫూర్తిఁ జంద్రధరస్ఫూర్తిఁ దనయశోధృతి భూతిగతులఁ గేరి
హరికుమారాభిఖ్య హరికుమారాభిఖ్య శౌర్యసంధారూప సరణిఁ గాంచి
నరమిత్రవిఖ్యాతి నరమిత్రవిఖ్యాతి బుద్ధితేజశ్శ్రీసమృద్ధిఁ జెంది
రాజరాజసమాఖ్య రాజరాజసమాఖ్యఁ గాంతిభోగవితీర్ణి గరిమమీఱి
ప్రస్తుతికినెక్కె దిక్పూరిప్రాభవుండు । ధారుణీభారధౌరేయ భూరిభుజుఁడు
రామచంద్రక్షితీశుఁ గారాబుపట్టి । రణవిజయకేళి నరసింహరాయమౌళి. ౧౩౮.

సీ. దట్టి[illegible]ధరహారదరహీర ఘనసారహిమపూర గగనఝరులఁ
బ్రహసించు శరదంతరఘనాంత హరిదంత కరిదంత విధుకాంత శరవరముల
నిరసించు హరిరాజ సురభూజ కతనూజ ఫణిరాజభసమాజ పారదముల
హసియించు హరికాండ బిసఖండ రుచిషండ శశిమండల సితాండజవ్రజముల



నెదురెయుంగనికయ్యంబు మదినిబూని । సకలలోకంబులందు స్వేచ్ఛమెఱంచు
రామచంద్రుని నరసింహరాయ ధరణి । పాలకాగ్రేసరుని సమాఖ్యాలతాంగి.

క. శ్రీకరముగ నరసింహ । క్ష్మాకాంతుఁడు పెండ్లియాడె జలజాక్షుఁడు ల
క్ష్మీకాంతామణిని వలె । లక్ష్మీకాంత న్భోగవిభవజితహరికాంతన్. ౧౪౦.

మ. పతిభక్తింబటుశాంతి బంధురమతిన్ భాగ్యోన్నతిన్ సన్నరుం
ధతి ధాత్రీసతి ధాతనాతి హరికాంతారత్నముల్ లోక సం
స్తుతిఁ గైకొన్నవిధంబున న్నుతులు గాంచున్ శ్రీలఁ జెల్వొందె యా
శ్రితరక్షామతియౌ నృసింహవిభు లక్ష్మీకాంత ధాత్రీస్థలిన్. ౧౪౧.

క. జననుతమై తనవంశము । ఘనముగ నాచంద్రతారకంబై వెలయన్
దినదినమును జిరసౌఖ్యం । బున మాధవరాయ నృపతిముఖ్యుండలరున్. ౧౪౨.

షష్ఠ్యంతములు.

క. ఏతాదృశ సౌజన్య స । మేతగుణవ్రాత ముదిత పృథ్వీజనతా
చేతఃపద్మునకును బ । ద్మాతరుణీ లాస్యసురుచిమత్పద్మునకున్. ౧౪౩.

క. హాలహల గళచూళితట । ఝుళఝుళదమరాపగోర్మి సహచరలీలో
జ్జ్వలకలధౌతరచనా । బల్వలసితబుద్ధి హసితపన్నగపతికిన్. ౧౪౪.

క. ప్రఖ్యాతోభయభాషా । వ్యాఖ్యానశ్రవణ వైభవస్ఫుటవివిధో
పాఖ్యానబోధబంధుర । తాఖ్యాముఖ్యునకు నిజసమాభిఖ్యునకున్. ౧౪౫.

క. ప్రణమద్వరిమకుటబలభి । న్మణిగణఘృణిమధుపనికరమానిత తరుణా
రుణ చరణ సలిలభవునకు । గణనీయసురేంద్రసదృశఘనవిభవునకున్. ౧౪౬.

క. ధీరునకు నర్థిజన మం । దారునకును వినతభూమిధవకులబల సం
హారునకు ధర్మమార్గ వి । హారునకును వివిధబుధజనాధారునకున్. ౧౪౭.

క. సుదతీజనమానస నవ । మదనాకారునకు నిఖిలమనుజేశ్వర సం
సదభిస్తుత సుగుణగణా । స్పదవాక్సారునకు సద్భుజాధారునకున్. ౧౪౮.

క. శ్రీరామచంద్రరాయకు । మారాగ్రణి కమితజీవమారుతఫణికిన్
ధీరస్తుత ప్రతాప । ప్రారంభనిరాకృతాంబరాంతరమణికిన్. ౧౪౯.

క. శతమన్యు సదృశభోగో । న్నతికి న్మహనీయ మేరునగసమధృతికిన్
శ్రితతాశ్రిత రక్షాచణ । మతికిన్ శ్రీమాధవ కుమారతల పతికిన్. ౧౫౦.

వ. అభ్యుదయపరంపరాభివృద్ధి యగునట్లుగా నా రచియింపంబూనిన వాసవదత్తా
పరిణయంబను మహాప్రబంధంబునకుం గథాప్రారంభం బెట్టిదనిన. ౧౫౧.

మ. స్మరసామ్రాజ్యరహస్యసమాన రమణీ, చంచత్సుధాంకక్షక
స్ఫురదుత్తుంగ సువర్ణసౌధముకురీ భూతాగ్రసన్నాపత్రపా
భరదత్తాంకసుధాంశుమండలము, చెప్పం బాటలీపుత్రమన్
బుర మొప్పున్నికటస్థితాభ్రతటినీ పూతాఖిలాశాంతమై. ౧౫౨

సీ. గిరిసార్వప్రభాస్వరత్ప్రాకారచిత, ఘోరహరివారచకిత దిక్కరివరంబు
సలిలాంతరిత రసాతలతాంతరుచికాంత జలజాంతపరిఘాభివలయితంబు
సురసాలజయశీలస్ఫురసాలవనజాలపరినీలసితవప్ర పరిసరంబు
ఫలపీతకలమ షూతలజాతరుచిధూతకలధౌతమయధరావిలసనంబు
గోపురాగ్రవిరాజితగోపురాంత । దీపితానర్ఘ్యరత్నప్రదీపసుప్ర
తాపభాసితవలయాద్రి భూపదంబు । భూపదంబుజనూపురం బాపురంబు. ౧౫౩

సీ. కుంభసంభృతశాతకుంభచ్ఛవిచ్ఛన్న చండభానుప్రభా మండలములు
తపనప్రభాబద్ధ ధౌతార్ద్రిదేలాభ జలధరాంకిత వలభిలసితములు
మదనాహవోదయన్మణితానుగుణరణత్కలరవాన్వితవిటంక వ్రజములు
శశికాంతమణిమయస్థలసమీకృతయంత్ర సలిలధారాపూరసులలితములు
నికటమణిసాలభంజికాప్రకటితోష్ఠ । బింబదంశనకుంఠితౌదుంబరాభ
తుండమండిత పంజరస్థాండజములు । నందఁజెలువొందు భూమిభృన్మందిరములు.

మ. కలధౌతాంకిత కేతనాంచితములై గన్పట్టు నాప్రోలి మే
డలఁ గ్రీడించు చకోరలోచనలఁ జూడన్వచ్చు నా చందనా
చల మందానిలముల్ దళత్కుముదకాసారాంతర ప్రోల్లస
జ్జలజామోదము గాన్కగాఁ గొనుచుఁ దజ్జాలాంత మార్గంబులన్. ౧౫౫

ఉ. సారసగంధులందు మణిసౌధములంగయిసేయువేళఁ గ్రొ
క్కారు మెఱుంగుఁగన్నులను గజ్జలరేఖలు దిద్దిదిద్ది బ
ల్సొరణగంటి దారిఁజను సోముని గాటుక గోరమీటినన్
జేరురమందు నాతనికిఁ జేర్చెఁ గళంకము నాఁటనుండియున్. ౧౫౬

సీ. పుణ్యజనద్రోహమునకు సైరింపక క్షమజనించిన బృహస్పతులనంగఁ
దారకద్వేషంబుఁ దర్కింపఁగా విశాఖతయుఁగాంచని శివాసుతులనంగఁ
బంకజోదయతా కళంకంబెఱుంగక చతురాస్యులైన వాక్పతులనంగ
జిహ్మగత్వము విసర్జించి రసాతలవర్తులౌ ఫణిలోక వరులనంగ
వేదవేదాంగ వేదాంతవివిధముఖ్య । విద్యలకు జన్మభూములై వెలసిరార
యాత్మదర్శనలబ్ధ భాగ్యాతిశయులు । విప్రవరులెన్న నప్పీటి విప్రవరులు. ౧౫౭



సీ. నరనాథుఁడయ్యు వానరసహాయతఁబోఁడు రఘుకులేశుని పరాక్రమము డెంత
కొండంతవిల్లుగైకొని ప్రసూనశరాసనుని జయించిన శూలి ఘనతయెంత
విజయనామంబుచే విలసిల్లి షండుఁడై పగవారికోడిగిన పార్థుఁడెంత
కోదండవిద్యకు గురుఁడయ్యును కుమారుఁడను పేరుగను గుహుఁడనఁగ నెంత
యనుచుఁ ద్రస్తరలాఘవుదు రనుదినంబుఁ । గదనజయవిక్రమక్రమ ఖ్యాతిమెఱసి
సాహసోత్సాహ విద్యావిశాలమతులు । రాజసుతు లమ్మహానగరంబునందు. ౧౫౮.

ఉ. కట్టఁగబట్టలేక చెలికాఁడు దిగంబరుఁడైనఁ జూచియు
న్బట్టుమటంచు నాక్కవెలిబట్టయు నియ్యక యాసగాంచుటం
బుట్టెఁ గుబేరభావమని పుణ్యజనేశు గణింప రప్పురి
న్బుట్టిన వైశ్యవర్యులు ప్రభూతనిదాననిధాన దానతన్. ౧౫౯.

క. ద్విజకుల పాదపయోరుహ । భజనానిస్తంద్ర సుగుణభాసురులై పా
దజు లుందురందు వైభవ । విజిత పురందరులు కృషివివేకధురీణుల్. ౧౬౦.

చ. అడిదము కేలఁబట్టి యెదురైన యరాతులఁద్రుంచివైచు శే
గడనయటంచు నాయుధముగైకొనకే పెడచేత దంతులం
బాటవడఁగించి సింగముల పొంకమడంచి భయావహంబులౌ
పిడుగులఁబట్టి శౌర్యమునఁ జేర్తురు వీరవరేణ్యులాపురిన్. ౧౬౧.

సీ. దర్పకుండను సూత్రధారునిపంపున భూమినాడెడు పైఁడిబొమ్మలనఁగఁ
దారుణ్యమను ఘనోదయమునఁ జిరకాంతినొప్పుఁజూపెడు తీఁగెమెఱుపులనఁగ
లావణ్యమనువార్ధి నావిర్భవించిన వెలలేనిరతనంపు మొలకలనఁగ
విటమానసములను విటపాంతరంబుల నల్లుకొన్న ప్రసూనవల్లులనఁగ
నమృతములుచిల్కు నధరబింబములుముద్దు । గులుకుపలుకులు యువశుకంబులకు విందు
సేయఁజెలువంది మిక్కిలి సోయగమునఁ । గళల నలరుదు రల వెలనెలఁత లందు./

చ. వెలవెలవాఱు వార్ధిఁ బ్రభవించిన వాహము పూర్వపక్షి మా
ఖులఁదలమాపు గ్రుంకులిడుఁ దోయజబంధు రథాశ్వము ల్దను
జ్జ్వల తురగోత్తమక్రమనివారిత తీవ్రమరుత్ఖురస్థిరా
చలహత భూపరాగములు సారెకుఁ బైఁ గ్రమ్మినం జుమీ. ౧౬౩.

సీ. సిందూరరేఖలచెలువంబు మిహిరారుణాంశు సంయోగసామ్యంబుఁ దెలుప
బంగారుగొలుసుల సింగారపుంగల్మి శంపాలతాచ్ఛాయఁ జౌకసేయఁ
బ్రకటితవర్ణవిభ్రమరాంకవాంకంబు మణిధనుఃకాంతిసామగ్రిఁ బోదల
భీకరగంభీర బృంహితారావము లగ్జారవముల వెఖరులమీఱ

సాంద్రతర దానధారల్లా సారలీలఁ। దనర వర్షావసర వారిధరములనఁగ
వైభవము గాంచు నప్పురవరమునందు। బంధురాకృతితో గంధసింధురములు.

సీ. హల్లకాగ్రంబుపై మొల్లమొగ్గలఁ జేర్చి పల్లవోష్ఠము దంతపంక్తిఁ జూచి
పంకేరుహముల నుత్పలములఁ జతలుంచి మొగముసుగనుదోయి సొగసుఁ జూచి
కనకకోరకము చెంగట మల్లెవిరియుంచి నాసయుఁ దమ్ముఖమునుఁ జూచి
చిగురుటాకులచెంత మొగలిరేకులు గూర్చి కరతలంబులు నఖాగ్రములుఁ జూచి
విరులుగొనవచ్చి యువజనుల్ మరునిబారిఁ। జనుటగని జాణతనమునఁ గోనుఁడుఁ పూల
బంతులని కేలు వక్షముపై ఘటించి। విలువఁ దెమ్మంద్రు పుష్పలావికలు పురిని. ౧౬౫.

గీ. వరఫలావాప్తి మహీపాలవరులఁ జేరు। నాతుకవ్రజలకుఁ జెయ్యెత్తినాశ్రయంబు
కరము పల్లవరుచికి దగ్గరినసాంక। జమునఁ దేల్తురు చేలలో వనితలచట. ౧౬౬.

వ. ఇవ్విధంబున నొప్పు నప్పురవరంబున కధీశ్వరుండు. ౧౬౭.

క. శాంతుఁడు భూనుతసుగుణ ని। శాంతుఁడు బుధబాంధవార్థి సత్కృవిజనతా
చింతామణి యలరారుఁ। జింతామణినృపతి భువిన జేయుండగుచున్. ౧౬౮.

సీ. కృతవసుదేవసంతతపూజనాధ్యుండు సాధుబృందావనేచ్ఛారతుండు
సతతసౌకర్యసంభృత ధరావలయుండు మంజువాక్సత్యభామాప్రియుండు
గురుయశోదానందకర నిజచరితుండు భోగిచూడామణి స్ఫుటపదుండు
ప్రహ్లాదవరదాన భాసురాభ్యాసుండు పుణ్యజనామోదపోషకుండు
ధరణిఁ బురుషోత్తమఖ్యాతిఁ దనరె నమిత। రాజకోటీరఘటిత చిరత్నసూత్న
రత్నఘనశాణకమణనిర్మలపదాబ్జ। దీప్రనఖమణిసుప్రభుండా ప్రభుండు. ౧౬౯.

క. నరసింహమూర్తి యగునా। కరుణాభరణుఁడు హిరణ్యకశిపుక్షేత్రా
దరదానగరిమ సదయ। త్వరితప్రహ్లాద దృప్తతావిస్ఫూర్తిన్. ౧౭౦.

సీ. తనరణోద్భటశక్తి దనుజారిపదభక్తి హరికుమారసమాఖ్య ననుకరింపఁ
దనదానవిస్ఫూర్తి యనుపమానసుకీర్తి సాంద్రచంద్రప్రకాశంబుఁ దెలుపఁ
దనసంతతవిభూతి ఘనశౌర్యఖ్యాతి పంచాననస్ఫుటప్రతిభ నెఱుపఁ
దనధీరతాబుద్ధివినుతక్షమాసిద్ధి తతధరాఖ్యాసమగ్రత వహింపఁ
బ్రాభవము గాంచె దిగ్వధూఫాలభాగ। మహితఘనసారతిలకాయమానకీర్తి
చంద్రికాస్ఫూర్తి సుమబాణసదృశమూర్తి। శత్రుసమవర్తి యారాజచక్రవర్తి.

గీ. వరుణునకుసాటి యాధరావరుఁడు దెలియ। సంతతాశాంతరక్షణోదంతలీలఁ
గుంభజునిఁబోలు నా ధరాజంభవైరి। దక్షిణాశాప్రసాధకోదయనిరూఢి. ౧౭౧.



క. రామనలనృగభగీరథ। భూమీశులకరణిఁ బ్రజలఁ బోషింపుచు ధా
త్రీమండలమున నాచిం। తామణినృపమౌళి బుధనిదానంబయ్యెన్. ౧౭౩.

గీ. ఆమహారాజసుతుఁడు విఖ్యాతిఁ గాంచె। క్ష్మాతలేంద్రుఁడు కందర్పకేతుఁడనఁగఁ
దనకు జనకునకును విభేదంబు లేక। దీపమున సంభవించిన దీపమనఁగ. ౧౭౪.

ఉ. భూనుతసత్కళాభరణ భూషితుఁడై యరిభీకరుండునై
యానృపసూనుచంద్రుఁ డుదయంబయినం బ్రజలెల్లసత్వ స
న్మానితలీల గోత్రహితమంజుల జీవనవృద్ధిగాంచి యం
భోనిధులోయనంగ మదిఁ బొంగిరి శ్రీరమణీప్రియాద్భుతిన్. ౧౭౫.

సీ. కలజాతినిగ్రహములు వాదములయంద ఖలయుక్తికలమభూతలములంద
రాజవిరోధంబు రాజీవములయంద యగ్నితులాశుద్ధి హైమమంద
వితతనుశ్వాసనోద్ధతి భారతమునంద కంటకబుద్ధిరోగములయంద
నిరతపరీవాదసరణి వీణలయంద ప్రచురనాస్తికత చార్వాకులంద
కాననగుఁగాని యిట్టియోగములు ప్రజల। యెడలఁ బొడచూపవయ్యెఁ గల్గఁ జలనీతి
శాస్త్రనిగదితకార్యవిచారసరణి। నమ్మహీజాని ధరరేయెలు నవసరమున. ౧౭౬.

మ. సురనారీపరిరంభణోత్సుక భటస్తోమాద్భుత ధ్వానభా
స్వరమై యస్రనదీశతాంకితమునై సంగ్రామరంగంబు సా
గరలీలం దనరారఁ భిన్నగజరక్తవ్యాప్తిఁ గప్పట్టుఁ ద
త్కరవాలంబు జయేందిరాచరణలాక్షారాగయోగాకృతిన్. ౧౭౭.

వ. వెండియు నభ్భూమండలాఖండలుండు సముద్రుండునుంబోలె సమకరప్రచారుండై మేరునగంబు చందంబున విబుధాలయుండై పరమేశ్వరుని విధంబున మహాసేనానుగతుండై భానుమంతునిభాతి ఛాయాసంతాపహరుండై మనోభవునిలీల జనితానిరుద్ధవిభవుండై దిలీపునిరీతి సుదక్షిణాన్వితుండై దశరథునిపైఖరి సుమిత్రోపేతుండై హిమవంతునిపగిది జనితశివుండై మందరాచలంబుగతి ననంతభోగపరివేష్టితుండై యామినీప్రియునిభంగి సన్మార్గనిరతుండై పురందరుని తెఱంగున బుధగురుకావ్యాదరుండై ఫణిసార్వభౌమునివిధంబున రసాతలాధీశ్వరుండై వసంతునిరీతి నానారామానందకరుండై భార్గవరాముని దారి సద్దాన భోగలీలాధురంధరుండై పారిజాతంబు కైవడి నాశ్రితనందనుండై పుండరీకాక్షునికరణిఁ గ్రోడీకృతక్షితనుండై కౌరవవ్యూహంబు హొరఁ సుశర్మాధిష్ఠితుండై శరన్మేఘంబుపోలికఁ గేవలాలంబితవిష్ణుపదుండై వర్షాంబువాహంబులీల విమలతరవారిధారాత్రాసితరాజహంసమండలుండై సుబాహుండయ్యును రామానుకూలుండై సమదృష్టి

యయ్యును మహోత్సాహుండై, ధృతరాష్ట్రుండయ్యు గుణప్రియుండై విద్యాధరుం
డయ్యు సుమనోవరుండై క్షమానుగతుండయ్యు సుధర్మాశ్రయుండై, నాయకరత్నం
బయ్యు నతరళస్వభావుండై ధరాపరిపాలనంబు సేయుచు నొక్కనాఁడు. ౧౬౭.

సీ. శశికాంతమణిగణస్థగిత భూములతోడ నీలపురాల తిన్నియలతోడ
నిలువుటద్దములు పన్నిన కుడ్యములతోడఁ బటికపుగుండ్రకంబములతోడ
వన్నెలీనెడు జాళువాదూలములతోడఁ గలధౌతమయకవాటంకములతోడఁ
దీరైనకెంపుల్పచూరు మొగ్గలతోడ మరకతంబుల గుజ్జుపనువుతోడఁ
దగడుమెఱుఁగుల ద్వారబంధములతోడఁ। బచ్చిపగడపుఁదలుపుల బారుతోడఁ
గళలలరు వ్రాఁతపనుల మేల్కట్లతోడఁ। జూడఁదగునంతరంబుల మేడలోన ౧౬౮.

క. మలయానిలములు చెంగట। మలయుచ్ధగధగ వెలుంగు మణిదీపములు
జ్జ్వలలీలఁ దనర బలువె। న్నెలచెలువలరార యామినీసమయమునన్. ౧౭౦.

ఉ. శిల్పచమత్క్రియాబలవిశేషసమంచిత పద్మరాగసం
కల్పితహైమమంచపరిగణ్య మరున్మృదు హంసతూలికా
తల్పమునందు మేనలరఁ దానొక శేషశయానుఁడోయన
న్బల్పలరారఁగా నిదురఁబోవుచునుండె నృపాలుఁడయ్యెడన్. ౧౭౧.

గీ. తూర్పుతెలుపెక్కమరునంపదొనలు చిక్కఁ। బద్మములు విక్కబంభరపటలి చొక్కఁ
గుముదములు స్రుక్క జాబిల్లి కొమరుదక్క। వేగ జామిక్కఁగనన య్యె వేగుఁజుక్క.

సీ. నీరధీశ్వరభామినీసఖీ కరతలచ్ఛాయాంకరాజతచ్ఛత్రమనఁగఁ
బశ్చిమాశాధీశభామినీ కర్ణాంతరాంకితవజ్ర తాటంకమనఁగఁ
జాశహస్తాంగనాభ్యాసహస్తాలోల చంద్రకాంతోపల చషక మనఁగ
వరుణలీలావతీ చరణపీఠీకృత స్ఫటికశీతల శిలాశకలమనఁగ
యామినీయమునాతటోద్యత్సమగ్ర। ఫేనమోయనఁ జరమపాథోనిధాన
తీరసముపేత శంఖదీధితిఁ జెలంగి। కైరవాప్తుండు చూడ నొప్పారె నపుడు. ౧౭౨.

చ. జలజలరాలు శీతకరజాత హిమాంబువుమీఁదఁ గ్రమ్మినం
గలువలపుప్పొడుల్ బురదగాఁ బదనెక్కినఁ ద్రొక్కలేక పై
నిలిచి మరందమాని నలినీవనవీథుల సందడించు న
య్యళులరొదల్ ముదంబొసఁగె నయ్యెడ మేల్కనుమానవాళికిన్. ౧౭౩.

క. పాలయలుకలతోఁబతుల। న్గలయని జ్యోత్స్నాభిసారికల నిద్దుర మే
ల్కొలిపి యుపరతులఁగలిపెం। గలకలనాదముల శారికలు నిలయములన్. ౧౭౪.



సీ. కాంతలభంగి సోత్కలికాకృతులు గాంచి దనుజులగరి నిశాంతముల కే
యల్పులరీతి స్నేహంబంతయు హరించి జరతులుబలె దశాంతరము నొంది
యస్త్రాస్త్రులనఁ బతంగాపతనముఁ జెంది యాఢ్యులదారిఁ బాత్రాప్తిఁ గాంచి
కాననములపోల్కి ఘనతేజమున హెచ్చి యధములలీల దోషాఢ్యత గని
మొదలమ్రింగిన చీఁకటుల్ మదిమిలోన। నాదిగియుండక బయలెక్కనోయనంగ
ధూమరేఖలు పైఁబయిఁ దొంగలింప। వెలవెలఁబాఱె దీపములైలివిదాలఁగి.

సీ. అలపులు దెలుపు వాలారుచూపులతోడ విడవిడఁబాఱు క్రొమ్ముడులతోడ
నీవులుజాఱు చెంగావిచీరలతోడఁ గరఁగిన యంగరాగములతోడఁ
బలుమొనల్నాటి కన్పట్టు మోవులతోడఁ గళలుచొక్కిన సెమ్మొగములతోడఁ
గొనగోటి చెనకులంటిన కుచంబులతోడ రహిఁ గిరిగొన్న హారములతోడ
భామలదిగజాఱు కస్తూరిబొట్లతోడ। నడుగుఁదమ్ములు దడఁబడు నడలతోడ
రమణులొప్పారి ప్రియమందిరములు వెడలి। రట్టియెడఁ జూపరకుఁ బ్రియంబావహిల్ల.

మ. తళుకుంజూపులు నీలపుంగురులు నిద్దంపైన సెమ్మోము కెం
దళిరాకుం జిగిమోవి విప్పులగుకండమ్ముల్ జూకాటంపు గు
బ్బలు బాగైనపిఱుందులుం గలిగి శేఁబ్రాయంపుఁ బ్రోవైన యొ
క్కలతాంగిన్గలఁగాంచి లేచి యదినిక్కంబంచు రాజయ్యెడన్. ౧౭౬.

గీ. కలనుగాననైన కామినీరత్నంబు। తనమనంబులోనఁ దాఁగియున్న
నిదురదెలిసి తెలియనేరనిచందాన। బయలు గౌఁగిలించుఁ బలవరించు. ౧౭౭.

క. నలుఁగడలఁ జూచుఁ దెలియక। కలవలపడు నెచటనుంటె కలకంఠి కొఁ
గిలియీవె యీవెయనుచున్। బెలుచ న్మదిలోనఁ దలఁకు బెగ్గలియుండున్. ౧౭౮.

క. లలనా నీవీగతితోఁ। గల నాడెసనిలిచి చేరికల నాయెడ మా
యలనాట్యము సలిపినఁగా। కల నానాఁటికిసి దాళఁగలనాయనుచున్. ౧౮౦.

మ. పరిభూతోచితకార్యసత్క్రియుఁడు నప్రారంభితాహారుఁడం
తరితోద్యోగుఁడు మారఘోరశరసంత్రస్త ప్రభావుండుఁ ద
త్తరుణీవక్త్రపునర్విలోకన సముద్యద్వేగవంతుండునై
ధరణీపాలకుఁ డోవరిన్మెలఁగె సంతాపంబు దీపింపఁగన్. ౧౮౧.

క. కటకట యా భూపాలుఁడు। కటకజనాలక్షిత ప్రకాశుండగుచుం
గటకములు జాఱ ఘనసం। కటకటితటఘటిత పాణికములుండయ్యెన్. ౧౮౨.

గీ. మేను శయ్యఁజేర్చి మానసవీథి నా। రణితనూపురమణి రమణి వెదకి
కనుఁగొనంగలేక కనుఁగొనలు మూసి। తలుపుఁ జేరఁజేర్చి తలఁపుగరిని. ౧౮౩.

గీ. అంత కందర్పకేతుభూకాంతుఁ డిట్లు । విరహవశమునందు మెలఁగక పరిజనంబు
లాక్రమింపెల్ల నెఱిఁగించి రా క్షణంబ । భూమిపతిహితు మకరందనాముఁ జూచి.

వ. అప్పుడు. ౧౯౫.

క. మందరధీరుఁడు విభవపు । రందరుఁడు ముకుందమందిరాయిత హృదయా
నంద కళాపూర్ణుఁడు మక । రందుఁడు కందర్పకేతురాయనికడకున్. ౧౯౬.

చ. వడిఁజనుదెంచి కాంచె సుకవంకవసించి యతండు శయ్యపై
బడవిడఁబాఱు జాఱుసిక వీనులఁ జిక్కులుగొన్న ప్రోగులున్
దడఁబడుహారముల్ చెలువుదప్పికనందగు మోముచందమున్
ముడివడు భ్రూవికారములునుం గల రాజకుమారశేఖరున్. ౧౯౭.

క. కాంచి దృగంచల సంచల । నాంచద్రుచి నించి రాక యాతని కెఱిం
గించినఁ జంచత్కాంచన । మంచస్థలినుంచె నతని మహిపతియంతన్. ౧౯౮.

గీ. కమలములు బాలభానునిఁ గాంచినట్లు । కైరవంబులు జాబిల్లిఁ గన్నయట్లు
సఖునిఁ గనుఁగొన నృపునిరీక్షణము లలరె । మందమందస్మితంబు లందంద నిగుడ.

క. అంత రతికాంతకుంతా । క్రాంతతచేఁ గొంతవింత గాఁ జింత నిజ
స్వాంతస్థిత కాంతాగత । సంతాపముఁ దెలిపి యంత జనపతివంతన్. ౧౯౯.

వ. ఊరకున్నం జూచి మకరందుం డిట్లనియె. ౨౦౦.

చ. ఇది తగునే ధరాతలమహేంద్ర మనంబున వంతయేల నీ
పదములుగొల్చి భూవిభులు పల్మఱుఁ గప్పము లిచ్చుచున్ భవ
త్సదనమునందు దాస్యములు సల్పఁగ శాత్రవులెల్లఁ గానలన్
మదమఱియుండ నీవు మహిమండలమేలుచునుండి యుండియున్. ౨౦౧.

సీ. కటక కర్ణాట బంగాళావనీశులుం ద్రవిడ కేరళశక ధరణిపతులు
కరహాట వరహాట కాంభోజనృపతులు గొంకణ కేంకణ క్షోణివిభులు
వంగ విదర్భలాటాంగధాత్రీశులు పాండ్యకైకుంతల మహీపాలవరులు
చోళ కరూశ నేపాళాధినాథులు నాంధ్రసౌరాష్ట్రదేశాధిపతులు
తావకీన పదద్వంద్వ దర్శనంబుఁ । గోరియున్నారు వారల గారవించి
సెలవుదయసేయవలెఁగాక యెలమిదప్పి । యిట్లు చింతింపనగునె ధాత్రీశ నీకు.

వ. అని మఱియు నతని చిత్తం బన్యాయత్తంబయ్యెనని నిశ్చయించి యా కందర్పకేతు
భూకాంతాగ్రణీస్వాంతంబు చింతాసంతాపలేశాక్రాంతంబై విషతరుప్రసవ
గంధానుభవంబుచందంబున క్షణక్షణాతిమోహవిధాయకంబై మత్తమాతంగపరి
భ్రమణంబువడువున స్వవశాలోల నిరీక్షణంబై కాముకచరితంబునుం బోలె



వామానురక్తవిభ్రమంబై యంధకారంబువైఖరి దోషానుబంధచతురంబై బహు
విధంబులం బ్రవర్తింపుచున్నయది యిది యసాధుజనోచితరీతి భవాదృశులకుం
దగదుగావున సన్మార్గంబవలంబించి యాహ్నికవ్యవహారంబు సలుప నుద్యోగింతు
గాక యనిన నతని కతం డిట్లనియె. ౨౦౩.

సీ. తరువులనీడ నెంతయుఁ బరాగము గ్రమ్మ గంతులు వైచును బంతులాడి
యక్షరాభ్యాసమం బాదిగా సకలశాస్త్రము లాజ్ఞపజ్ఞఁ దత్పరతఁ జదివి
వెన్నెలనెలకొనాలతిన్నెలపైనుండి నృత్తగీతాదుల నేరుపెఱిఁగి
మనసెఱుంగఁగరాని మర్మము ల్దెలపోసి యగార్జితమంత్రంబు లూహచేసి
కార్యదక్షుండవగుచుఁ బ్రఖ్యాతిగాంచి । ప్రబలితివి ప్రాణసఖుఁడవు బాంధవుఁడవు
నామనంబుననున్న సంతాపమెల్లఁ । గినుకసేయక వినఁదగు ననఘచరిత. ౨౦౪.

ఉ. నిన్నటిరేయి నాయెదుర నిల్చెఁ గలం గలకంఠి యోర్తు యా
కన్నులఁ గల్కిఁ జూడ తెలుఁగంటి మిత్రారియొ నాగకన్యయో
యెన్న మనుష్యభామినియొ యెంచఁగనుంగొన మట్టి రూపసం
పన్నవయోవనోదయ విభాసుర చంచలదృగ్విలాసముల్. ౨౦౫.

క. కలకంఠనాదు చెంగటఁ । గల నేర్పటికి మాయచేరికలఁదిరిగెన్ జి
ల్కలకేరిడగరబలు ధా । కలపాత్రై నిర్వహించఁ గల నా సఖుఁడా. ౨౦౬.

గీ. కలికి కురులకు సామ్యంబు గాంతుమనుచుఁ । బోరి సరిరాక నీలముల్వారిగతిచెఁ
గనకసౌభాగ్యమమియుఁ గనక పాదలు । దూఱి వేఁడాకజాతికిఁ జేర నళులు.

క. ఆననలావణ్య సుధాం । భోనిధిలో నీఁదులాటఁ బొల్పారెడు పా
ఠీనద్వంద్వం బనఁగా । మానిని కనుదోయి మెఱసె మానితలీలన్. ౨౦౮.

చ. కలువలడీలు చేసియును గాముశరంబులఁ బోలి సొగసై
తెలివిఁ జెలంగుచోఁ దమగతిప్రసరంబుల నడ్డగించె శ్రీ
లలిత విభూతిఁ గర్ణయుగళంబని కిన్కజనించెనో యనం
గలికి మెఱుంగుఁబోఁడి కడకన్నులఁ గెంపలరారు నింపుగన్. ౨౦౯.

గీ. కువలయప్రియ సంతతోత్సవముఁ జెందెఁ । గళల నలరారెఁ దారకావిలసనంబు
గాంచి రాణించె నెన్ని వైఖరుల నైనఁ । బడఁతి నెమ్మోము చంద్రబింబము నిజంబు. ౨౧౦.

క. తను సూనలతాపల్లవ । మన వదన నిశాకరోదయస్ఫుట సాయం
తన రాగ మనఁగ విద్రుమ । ఘనరుచిఁ గెమ్మోవి దనరుఁ గాంతామణికిన్. ౨౧౧.

గీ. నయన లావణ్యజలధి బంధనమనంగ । దశనరత్నావళీతులాదండమనఁగఁ
గనకగౌరక సౌభాగ్యకలన లలన । కలరు నాసిక తిలపుష్పమపహసించి. ౨౧౨.

నవనవలీలతోఁ బుతఁ గనందగు నీవు లలంకరించి నై
భవమున హెచ్చు రత్నముల పోఁజులకమ్మల మేలుడాలుఁ పైఁ
దవిలి చెలంగు నా క్రమదామణి చెక్కులు పంకజాత బాం
ధవరుచిదిగ్ధ హేమమయదర్పణ దీప్రవిభాసమగ్రతన్. ౨౧౩.

క. వనిత కనుబొమలు సింగిణు । లనఁదగు దృగ్మదన శరసహాయము లగుటం
గనకాంగి నాసలు లేసెల । కెనయగు మృగమదకళంక మేపారుటచేన్. ౨౧౪.

గీ. తరుణి శైశవమను పగ్గదళముఁదలఁప । జిత్తజుఁడంతఁ గుచదుర్గసీమహత్తి
దిట్టమై గెల్చి పూరింపఁ బట్టినట్టి । శంఖమాయన గళమొప్పెఁ జంద్రముఖికి.

సీ. అసమాన మానమానస మానసోద్భూత కనకసారస కోరకంబులనఁగఁ
గాళోదరప్రభాకల్ప రోమావళీ లతికాప్రభూత ఫలంబులనఁగ
హారవల్లీమృణాళాదనేచ్ఛాలోల ఘర్మ ఘాంచ ద్రథాంగంబులనఁగ
శంబరాంతక రిరంసాస్థలాయిత హేమలాలితక్రీడాచలంబులనఁగ
జవ్వనంబను పన్నీటి చలువతోఁటఁ । గొమరుమిగిలిన బంగారు కుండలనఁగఁ
గంతు పూఁదోఁటలో విరిబంతులనఁగ । నలరె లలనకు వక్షోరుహములు బళిర.

మ. సరసీజాతభవుం డుఁరోభవసిసృక్షావేళ ధీచాతురిన్
గిరిసారంబొనఁగూర్చి తద్గురుభరాక్షేపంబుఁ జింతింపుచున్
గిరిసారస్ఫుటకీలలం దుదల నిక్షేపించెనా నొప్పె వి
స్ఫురదగ్రప్రతిభా మనోజ్ఞరుచి వక్షోజంబు లా యింతికిన్. ౨౧౬.

గీ. అతివభుజములు బిసలతలైనయపుడె । శయములెంచంగఁ దత్కుశేశయములయ్యె
నంగుళులయందు నూర్మికలలరుచుండ । నాతిమంజేతులకుఁ గంకణంబులరుదె. ౨౧౭.

చ. అతనుఁడు నాభికూపమున నంచితలీల మునింగి తద్వళి
త్రితయము పేరిమెట్ల నాకరీతిగనందగు నారుదారి సం
గతిఁజని తత్పయోధరశిఖా ధరణీధర లింగమూర్తులన్
బ్రతిదినమున్ భజించి సిరిపట్టెననం దనరారె నెంతయున్. ౨౧౮.

గీ. అంబరంబనంగనచ్చోట సంశయ । మేలయట్లయగును బాలకౌను
ఘనపయోధరములు గనవచ్చె నామీఁద । సాంద్రచంద్రరుచులఁ జౌకయయ్యె.

క. హరిణాక్షి నితంబస్థలి । ధరణీమండలియనంగఁ దథ్యంబుగ సు
స్థిరతం దగుఁ బైరత్నా । కరమేఖలలీలసాక్షిగా చే తెలియన్. ౨౨౧.

గీ. తరుణిమోద్దండ మత్తవేదండతుండ । కాండములనంగ విజయసంఘటిత పంచ
శరపురద్వార కదళికాస్తంభములన । నూరువులు చంద్రముఖి కలరారు నౌర.



క. తలిగాకుం గైదువుగల । వలరాయఁడు గట్టుమించివానిం గడఁకన్
గెలిచిమురయుంచు జయకా । హళములనన్ జంఘలలరె నంబుజముఖికిన్. ౨౨౨.

గీ. కలికి పదనఖముల పోల్కిఁ గంటిమనుచు । మించి తారలు మిన్నందిమెఱసె నౌర
కాంత మీఁగాళ్ళతో జతగానికతన । నహహ కూర్మకులాధీశుఁ డడుగువట్టె.

గీ. అతివపదయులు చిగురాకులైనయపుడు । తన్నఖంబులు సితలతాంతమ్ములయ్యె
నాతియడుగులు పుష్కరఖ్యాతిగనిన । నా నఖంబులె తారలై యతిశయిల్లె. ౨౨౪.

సీ. వర్షాభ్రలక్ష్మియో వనిత సముల్లసద్ధార పయోధరోదయముఁ జెందెఁ
గురురాజుబుద్ధియో కోమలి కర్ణవిశ్రాంతదృగంత విశ్రాంతి నలరె
వింధ్యభూమూర్తియో వెలఁది తుంగశ్యామలకుచ సౌభాగ్యలీలలఁ జెలంగె
వానరసేనయో మానిని సుగ్రీవనీలాంగదాప్తి రాణించియుండె
గురుకటిద్వయ లోహితాధరము వికచ
లోచనోత్పలములుఁ జంద్రరోచమాన
హాసమును మందగతి భాస్వదంఘ్రియుగళ
సౌమ్యతయుఁగాంచె గ్రహసమస్యయు లతాంగి. ౨౨౫.

సీ. గళకాంతికోడి భగ్నంబయ్యెఁ గ్రముకంబు కంబులింకేమి ప్రఖ్యాతిగాంచు
మురుఁగు రేలను బద్మములు మోముసరిరాక రాకచందురుఁడెంత ప్రభవహించుఁ
గాఁకలఁబడె మేనికళఁజూచి బంగారు గారుడంబాడసాగదు చపలకు
నధరంబుఁ జెనకఁదా నల్లాడుఁ జిగురాకు శాకున్నె హతి కెంపురవలకెల్ల
నింతవర్ణింపఁగా నేల నింతిసొబగు । నాలుగైదాఱుమోముల వేలుపులును
వినుతిసేయంగ నూపరు వేయనేల । వేయిమోములదొరకైన వింతసేయు. ౨౨౬.

ఉ. కన్నులఁగట్టినట్లు పొడకట్టెడుఁ గన్నియ చిన్నెలెల్ల నా
కన్నియయున్నెమనందగు హృదంతరతాపముదీఱఁ గూర్మితో
నన్నలినాయతాక్షి మధురాధరబింబ సుధారసంబు నా
కెన్నటికైనఁ గల్గునొకో యీజననంబునకు న్ఫలంబుగన్. ౨౨౭.

క. దితియుంబలె మామకమతి । శతమన్యు సమాకులత విచారముగనె స
న్నుతచరిత నిన్నుఁ గాంచిన । కతమున నీపాటిశాంతి గలిగెం జెలియన్. ౨౨౮.

వ. అదిగావున నీవు దెలుపు కార్యాకార్యవిచారంబు నా మనంబునం జూరదు మనో
జాతకీలికీలాభీలజ్వాలావలీఢంబయ్యె హృదయంబు నంగంబున నంగారకణంబు
లుద్భవిల్లెడు ధైర్యంబు దొఱంగిన చందంబున నున్నయది సమయోచిత విహారంబు
సలుపవలయు మదీయ క్షేమమోదానుభవంబు నీకు నవశ్యకర్తవ్యంబుగదా యదమని

మకరందముండునుం దాను నమ్మహీతలేశ్వరుండు పరిజనాలక్షితుండై దూరంబరిగె ననంతర కథాప్రసంగంబు. ౧౨౯.

మ. శరవిద్యాబలరామ రామపదకంజద్వంద్వ సంభావనా
దరభాగ్యాంచితకామ కామజననీతారుణ్య లాస్యోల్లస
త్కరుణావీక్షిత ధామ ధామ విభవోద్దామారవిందాభవ
క్త్రరమానిర్జిత సోమ సోమనిభ రంగత్కీర్తి కాంతామతా. ౧౩౦.

క. గిరికిరికరిహరి భరహర । నిరతధరాభరణ చరణ నికటనటద్వి
ద్ధరణీవర మకుటాంతర । గురుతరమణికిరణ శత్రుకులసంహరణా. ౧౩౧.

మాలినీ. పరిహృతరిపుజాలా పాలితక్ష్మాఢ్యజాలా
సరసగుణనిశాంతా సాధులీలాతిశాంతా
నరనుతగుణకాంతా నానటత్కీర్తికాంతా
కరధృతహరిణాంకా ఖడ్గనారాయణాంకా. ౧౩౨.

గద్య. ఇది శ్రీవక్కలంక చంద్రశేఖర మహాకవిపౌత్ర భాస్కరసుకవిపుత్ర
విద్వజ్జన విధేయ వీరభద్రనామధేయ విరచితంబైన వాసవదత్తా
పరిణయంబను మహాప్రబంధంబునందుఁ
బ్రథమాశ్వాసము.

---

## ద్వితీయాశ్వాసము.

క. శ్రీమత్పీఠాపురకుం । తీమాధవదేవ పాద నీరజసేవా
సామర్థ్యలబ్ధవిజయర । మాముఖ్యసహాయ, రావు మాధవరాయా. ౧.

వ. అవధరింపు మట్లు చనిచని పురోభాగంబున. ౨.

చ. కనుఁగొనియెం బురస్స్ఫురదగస్త్యమహాముని రాజవాక్యపా
లనమతిరుద్ధమేరుజయ లక్షణలక్షితశృంగ నానట
ద్వనచరబాలికా విధృతవంశసముద్భవ మౌక్తిక ప్రభా
జనిత వలక్షరూపతటజాత తమాలము వింధ్యశైలమున్. ౩.

సీ. సురసుందరీమనోహరపాదయావకమండిత యాధికామంటపంబు
సితగరుత్మత్ఝరీగత మరుద్వృతదరీఫణిఫణామణివిభా భాసురంబు
పటుశిఖాముఖహృతస్ఫుటతరాగరుగంధబంధురదవమరుద్బాంధవంబు
హృద్యవిద్యాధర వాద్యవిద్యాళిక ఘననాదనృత్యచ్ఛిఖావళంబు
గుంజదళిపుంజ మంజు నికుంజసదన । మదనకదనామరాదృత మధురమధుర
సానుభవసానుభవ సుగంధానుమదిత । శబరబింబాధరాళి యా శైలమౌళి.

వ. కాండియుం బ్రచండవేదండ శుండాదండ విఖండిత శాఖామండల శ్రీఖండ ద్రవపిచండిల సానుచరసానుచర కిన్నరీమధురగీతాకర్ణనదశా పరవశచమరీగణ గ్రహణలీలాఘిలనిషాదరూపా భూషితోపత్యకాతలంబును సరభసాకుంఠకంఠీరవ నఖముఖ విదారితాదంభకుంభికుంభ సంభూత నూతనముక్తాఫలజాతసంజాతా సమయతారాగణ శంకాసంకులాధిత్యకా ప్రదేశంబును శాఖామృగప్రకంపితోత్తాలతాళరసాల గళితలలిత ఫలరసప్రసర ప్రలంబమాననిర్ఝరప్రాంతసంక్రాంత క్రౌంచసంచారాంచిత పరిసరంబును నదభ్రాభ్ర విభ్రమాభ్రంకషాగ్ర సమగ్రధాతుసంఘాత సముపజాతానవసర సంధ్యాదర్శనవిరహవిధురచక్రవాకద్వయీ సంతాపహరణ చణస్ఫాటికశిలాతలాంతర్బింబిత పద్మరాగశృంగప్రతిబింబాళిక నాళీకప్రియోదయంబునునై విరాజిల్లి మధుసూదనాకారంబునుంబోలె విచిత్రవనమాలాలంకృతంబై నీలకంఠకంఠంబునుంబోలె నాగనిశ్వాస సముత్థితప్రభూతి భాసురంబై చతుర్ముఖస్వరూపంబునుంబోలె హిరణ్యగర్భతానిర్భరంబై సుగ్రీవప్రభుత్వంబునుంబోలెఁ గేసరిశరభగవయాదిసేవిత పాదపంబై మీమాంసాన్యాయంబునుంబోలెఁ బిహితదిగంబరదర్శనంబై ఛందోవితతియునుంబోలె దర్శితమత్తమయూరాదివృత్తవిలాసంబై శ్రీనగంబునుంబోలె మల్లికార్జునాధిష్ఠితంబై

భీష్మయుద్ధంబునుంబోలె శిఖండియుక్తార్ధచంద్రసమాలీఢంబై కాముకచిత్తవృత్తియుంబోలెఁ గాంతారోష రసానుగతంబై యతిభీమరూపంబయ్యుఁ గీచకాక్రాంతంబై కుజన్మాకరంబయ్యు సద్వంశభూషణంబై సుప్రశస్తంబయ్యు నపరిమాణంబై యొప్పు నప్పర్వతంబు చెంగట. ౪.

క. జనపతికనిగొ నృతిమ । జ్జనజనతాధూత వృజినజాతవిరావన్
వనచరతను ఘర్మస్తం । భనసుమహిత శీకరప్రభావన్ రేవన్. ౫.

సీ. కవిరాజులిరవంకఁ గైవారములు సేయ సన్నిధి రాజహంసములు నిలువ
ధీవరుల్ వేవేలు సేవతోఁగొలువంగ ననితరపుణ్యజీవనత మెఱయఁ
బద్మాభిరామ సౌభాగ్యంబు రంజిల్లఁ బ్రమదాళి గానవైభవము చెలఁగఁ
గంకణసూర్మికాలంకృతుల్ విలసిల్లఁ గువలయానందకృద్గుణములలరఁ
బ్రభుతఁ గనుపట్టుఁ బులినవిభ్రాజమాన । తటనటద్వాయుడింభ సంఘటిత వింధ్య
కటకసురదారుకేసర స్ఫుటతరంగ । హతిపరిప్లుతవనదంతి యా స్రవంతి. ౬.

చ. అనిశము గ్రీష్మవాసరములందు దినాంతములం బుళిందభా
మినులు జలావగాహన సమీహితలీలలఁ దేలఁ దద్ఘన
స్తనఘనసారసంకుమదసౌరభ సంగ్రహణేచ్ఛచేఁ బ్రభం
జనుఁడు చరించు మందగతి సంధిలఁ దత్తటినీతటంబునన్. ౭.

సీ. సతతభూభృత్సేవ సలుపు నర్థాపేక్ష గలుగు హేలావతీగతిఁ దనర్చి
తతకబంధస్ఫూర్తిఁ దనరారు రామసంగ్రామభీమస్థలికరణి నలరి
వేళాభివృద్ధిగావించు వాసరముఖలక్ష్మీవిలాసలీలలఁ జెలంగి
ముఖభంగవిభ్రమంబులు గాంచు నతితరకృద్ధవృద్ధాంగనరీతి మెఱసి
విమలకమలాంతర భ్రమద్భ్రమర మధుర । ఝంకృయాగీతతానసంజనన హేతు
భూతతటరుహ కీచకోద్భూతశీత । పవనగతిఁ బొల్పు నా సరిత్ప్రభువధూటి. ౮.

గీ. అంబుజానన మీనాక్షి యా స్రవంతి । సలలితతరంగహస్తము ల్సాచి కంక
ణములు మెఱయంగ నుపగూహనంబొనర్చు । వింధ్యనగరాజుఁ గామినీవిధము దోఁప. ౯.

స్రగ్ధర. భూవిఖ్యాతప్రభావస్ఫుటసలిల ఝరీపూరతత్పుణ్యరేవా
సేవాహేవాక భావాంచితగతి నృపతిశ్రేష్ఠుఁ డవ్వేళ వింధ్య
గ్రావప్రాంతప్రధావ ద్ఘనమృగనికరాక్రాంత కాంతారభూమిన్
ద్రోవన్రాఁజూచి ధీరస్తుతుఁడగు మకరందుండు దానిట్లు పల్కున్. ౧౦.

క. జనవర చూచితివే యీ । వనము ఫలప్రదమహీజ వైభవజిత నం
దనము సమస్త మృగావన । మనవరతసమందపవన మనఁదగుఁ దెలియన్. ౧౧.



క. చిన్నలు సంపెంగలు సుర । పొన్నలు మామిళ్ళు పోగడపొదలును మావుల్
చిన్న కప్పురంపుటనఁటులుఁ । గన్నులపండువులు సేయుఁ గన్గొను మిచటన్. ౧౨.

చ. నృపవర చూడు మల్లదె దరీకుహరాంతరదంతదంతుర
ద్విపనిపతన్మృగేంద్ర మతిదీర్ఘభయంకరవాల మున్నట
ద్విప్రులసటాభిరామ తనుదీధితిభవ్యము దీనిరూపు ని
శ్చపలత వ్రాసి చూడఁగ నశక్యము చిత్రపటాంతరంబునన్. ౧౩.

మ. అదిగో పేటోక సింహశాబకము దంష్ట్రాభీలలీలన్ సట
ల్గదలించె న్జతురశ్రదృష్ట భయదాకారంబులోఁ దిన్నసై
పదముల్ద్రిఁదికి నెత్తి నాదమెసఁగ న్భద్రేభ రాజంబుపైఁ
బొదలం గ్రౌర్యముతోడ దీనివిధము ల్భూమీశ కన్గొంటివే. ౧౪.

శా. భల్లూకంబులఁ జూచితే తిమిరసంపల్లాలితాంగ ప్రభో
ద్యల్లీల న్ఘననీలనీలఘనసఖ్యం బెప్పుడుం జేయఁగా
వల్లీవేల్లిత వామలూరువుల క్రేవం గొంటుజుంటీఁగ లం
దెల్లం గుయ్యిడఁ జేనియల్గొనెడు భూమీశా విచిత్రంబుగన్ ౧౫.

క. కనుఁగొన బిడాలములు సా । దన బిలముల నాఖువుల మదంబడఁచు క్రియ
న్వనగవుల గవులదవులం । జొనిపి విజృంభించు పులులఁ జూడు నరేశా. ౧౬.

క. అనుచుఁ గనుఁగొనుచుఁ గానన । మునఁ గనుఁగొనఁదగు వినోదములు మకరందుం
డను మోదింపుచుఁ దెలుపఁగఁ । జనిచని కందర్పకేతుజనవిభుఁడంతన్. ౧౭.

మహాస్రగ్ధర. అటఁగాంచె న్మానసాబ్జంబలగసురనగప్రాంత సంక్రాంతజంబూ
కుటజాయాదభ్రభావాంకురిత కిసలయాకుంచి తాత్మీయశాఖా
పటలచ్ఛాయా కులాయప్రకటిత కురరీబాంధవాయాతకీర
స్ఫుటవాఙ్మాధుర్య ధుర్యాగ్భృతమగు నాక జంబూధరిత్రీరుహంబున్.

సీ. ఛాయామనోహర సౌభాగ్యమున మెచ్చి భాస్వదాకృతిచేతఁ బ్రబలుటరుదె
లాలితానేకపల్లవవిలాసముఁ గాంచె విటపశేఖరరూఢి వెలయుటరుదె
ఘనపత్రవైభవఖ్యాతిఁ జెన్నలవారె రాజమానోన్నతిఁ గ్రాలుటరుదె
లక్ష్మీసమగ్రలీలలనొప్పె నలవిష్ణుపదసేవ నేప్రొద్దుఁ బొదలుటరుదె
యనివినుతిసేయఁదగు లతాంతానురక్త । పసలదాయాద నిజవిభాభాసమాన
ఫలరసాస్వాద సంతోషభరిత భూరి । శారికాకీరవార మాభూరుహంబు. ౧౯.

గీ. ఎన్నఁదగుచున్న యాచిన్నగున్ననీడ । విపులవిపులాతలంబున విశదభంగి
నధ్వజశ్రమవేపమానాంగుఁ డగుచు । మేదినీవల్లభుఁడు విశ్రమించెనంత. ౨౦.

చ. తపనుఁడు పశ్చిమాంబునిధిదాఁగెఁ బ్రతీచికిరాగమబ్బె నీ
లపురుచితోఁ దమంబు దెసలందనరారె నుడుల్చెలంగెఁ బూ
రుపుదెసఁజొక్కెఁ బంకజవిరోధి శుభోదయమొందె నైందవా
తపములుగాయఁజొచ్చెఁ గుముదద్యుతి గన్గొనవయ్య నయ్యెడన్. ౨౧.

చ. అల మకరందుఁడచ్చటి వనాంతమునంగల కందమూలముల్
ఫలములుఁ దేనియల్విమలపద్మదళాంతర వారిపూరముల్
చెలఁగుచుఁ దెచ్చినన్మదిరుచించినలాగున నారగించి భూ
తలపతి పల్లవప్రకరతల్పమున న్శయిఁజేర్చెనంతటన్. ౨౨.

క. మకరందుండును నిద్రా। ముకుళిత దృశుఁడగుచు నృపునిముందఱఁ దా వే
ఱొక చిగురుటాకు సెజ్జన్। బ్రకటాకృతిఁ బవ్వళించె శ్రాంతుండగుచున్. ౨౩.

వ. అంత. ౨౪.

గీ. మారనారాచ దోధూయమానుఁ డగుచుఁ। బ్రభుశిఖామణి మానస ఫలకమునను
వరుససంకల్ప తూలికవ్రాయుచుండెఁ। గలికిరూపంబు చిత్రవైఖరులతోడ. ౨౫.

చ. అన్నిశఁ దుర్యయామసమయంబున నచ్చటి చిన్నగున్నపైఁ
జెన్నలరారు నీడజవిశేషములం దొకశారి చిల్కపైఁ
గన్నుఱఁజేసిపల్కె వలుకన్ శుకశేఖర సఖ్యమెల్ల నేఁ
డెన్నికకెక్కె నీవిటకు నిన్నిదినంబులు రాకయుంటచేన్. ౨౬.

క. శారికలుఁ గీరములు నీ। భూరుహమునలేవె సఖ్యమునకుం దలఁపన్
సారెకు నీతోఁ జేరిక। గోరుటకుం గారణంబు గుణివనికాదే. ౨౭.

చ. శ్రుతిహితవాక్ప్రభావములఁ జొక్కియు నీ హరితత్వవైఖరుల్
మతినిదలంచియున్ ద్విజసమాఖ్యగణించియు నాగమాంత సం
తత భజనంబులెంచియును దావకసఖ్యముఁ గోరువెల్ల నో
పతగవతంస సత్ఫలవిభావన తథ్యమొనర్చుటంజుమీ. ౨౮.

మ. తనయింటన్భుజియింపుచు న్గలిగినందానిచ్చుచు న్వాక్యము
న్మనసుంగల్పితంబుఁ దెల్పుచును సన్మార్గంబునందుండు చే
ఘనమాసఖ్యముజాడగాక నిజహృద్గర్వాంధత న్వర్తిల
న్జనునే మైత్రియొనర్ప నేరికి శుకేశగ్రామణీ ధీమణీ. ౨౯.

క. ఎచ్చటికేగితి విన్నా। ళ్ళెచ్చోవసియించఁగంటి వీప్రొద్దుకడ
న్వచ్చేయం గతమెయ్యది। యిచ్చటికిం దెలుపవలయు నిఁకవిశదముగన్. ౩౦.



వ. అనినం గీరము సంతసంబునఁ దదీయాలాపముల్మెచ్చి యి
ట్లను నోశారిక యేను బుణ్యతరులం దండందవర్తించి స
జ్జనగోష్ఠిగతి నొక్కవార్తవిని వీక్షాబుద్ధి నచ్చోటికి
న్ఘనవీథిన్జనికాంచి యిచ్చటికి రాఁగంటింజుమీ యిట్లనన్. ౩౧.

క. శారిక కీరముతో ననుఁ। గోరిక మదిఁబొడమ దెసలకుం జని యిపుడే
చేరికథవింటి కంటివి। యిటుచేరిక నెఱిఁగించు కీరశేఖరయనినన్. ౩౨.

క. కామాకులుఁడా భూవరుఁ। డామాటలు వినుటగోరి యట నిద్రాళుం
డౌ మకరందుని లెమ్మని। యీముచ్చటలాలకించు మిపుడని కడఁకన్. ౩౩.

గీ. వారలాముచ్చటలు చెవి చేరఁజేర్చి। వినుచునున్నంత శారికాయనుచుఁ బిలిచి
విని కనుంగొనివచ్చినవింత దెలియఁ।బలికె నిట్లని శుకము సంభ్రమముతోడ. ౩౪.

చ. అసదృశ చంద్రకాంతమణి హారిశిరోగృహభాగభోగ భా
గసమశరప్రభూత కదనాంతనిషేవిత చందనాగలా
లసమరుదంకురక్రమ చలజ్జలజాకర ఖేయగేయమై
కుసుమపురంబు చెప్పఁగఁదగు న్ధరణీ తరుణీలలామమై. ౩౫.

సీ. గణుతింప మందరాగములయ్యుఁ బోలుఁ గాకున్న నవసుధాకలనగలదె
జతసేయ బలినివాసంబులు గాఁబోలుఁ గావేని సుతల విఖ్యాతిగలదె
చర్చింప సుగ్రీవసైన్యము ల్గాఁబోలుఁ గానిచో నగవాక్షగరిమగలదె
యూహింప జలదసందోహము ల్గాఁబోలుఁ గావన్న నిటువంటి ఘనతగలదె
పోలికయొనర్ప నిధులుగాఁబోలుఁగాక। యున్న ధనదాశ్రయంబులై యుండఁగల
యనుచుఁ జూపరు లద్భుతంబందియుండఁ। జూడఁగాఁదగు బంగారుమేడలచ

చ. కనఁదగునందునిందు మణికల్పితకుట్టిమరమ్య హర్మ్యసీ
మను మను మానినీమణి సమాజము తేజము సోయగంబు గాం
చిన ఫలియించుఁ గోర్కులని చిత్తమునందుఁ దలంచుటంజుమీ
యనిమిషభావమందుట సుధాశనులెల్లఁ ద్రివిష్టపంబునన్. ౩౬

క. సంతానములకు నభినవ। సంతానములనఁగఁ దనరి సన్నుతరుచివా
సంతానవదృగ్లసదళి। సంతానములైనవను లసంఖ్యములచటన్.

సీ. ఉల్లసత్కల్లోల హల్లీసములు భాస్వరత్సారసాంగ విభ్రమముఁ దెనుపఁ
జామీకరాంబుజచ్ఛాయ మాద్యత్పుణ్యవనితాననములకు వన్నెయొసఁగ
లహరీఝుళంఝుళ న్మహితారవము తటాంతోత్క్రోశ దాత్యూహకోలాహలము
ఫేనప్రభానిభఫేనంబు తీరకల్పద్రుమ ప్రసవ సంపత్తినేల

నచటఁ దులకించు వినువాఁక విచికలప్ర । కాశకాశప్రభాశనీకాశరుచులఁ
దాళశతకసముత్తాల తాలగేయ । ఖేయమై సురపథికపాథేయమగుచు. ౩౯

సీ. ఆల పాలకడలిలోపలి దీవిలోపలఁ జెలువొందువేలుపుఁ జెట్టుతోడ
నీడుజోడునై చూడనొప్పగుచున్న కడుమలనీడఁ జొక్కపుఁదలంపు
రాలఁ బన్నిన నిబ్బరంపైన గద్దెపై మూఁడుకన్నులసామితోడఁ గూడి
జేజేలనెలఁతలు చేరికొల్వఁగ నిందుసంతోషమున నుండుచామ జగము
తల్లి చండికయను పేరు దాల్చి కడఁక । నమ్మహానగరంబున ననుదినంబుఁ
గాపురంబుండుఁ దనుఁజూడఁగఁడఁగు వారి । పాలి వేలుపుగడ్డినాఁ బరఁగుచుండి.

వ. ఇట్లఖిలనగరీనాయకరత్నంబై యొప్పు నప్పురవరంబున కధీశ్వరుండు. ౪౧

సీ. శ్రీసతీశ్వర పాదసేవాభిహిత సుధీభాసురుం డవితమహీసురుండు
దశదిశాముఖ మహోదంచత్ప్రతాప విభ్రాజితుం డవనీశపూజితుండు
నిఖిలప్రజా మనోనీరేజనవ్య ప్రభాకరుండు లసద్గుణాకరుండు
కమనీయభోగభాగ్య ప్రధానిర్జితాఖండలుండు జితారిమండలుండు
వినుతిసేయంగఁదగు జగద్వినుతకీర్తి । చంద్రికాధాళధళ్య నిస్తంద్రవిభవ
హసిత కైలాసనగవృషాధ్యక్షచంద్ర । శేఖరుండైన శృంగారశేఖరుండు. ౪౨

సీ. సర్వజ్ఞమౌళి యీ జగతీతలేశ్వరుం డతుల రాజసమాఖ్యనలరుటరుదె
కరమున శతకోటిగలమేటి యీతఁడు ఘనసుధర్మాఢ్యతఁ గాంచుటరుదె
బలభద్రసహితుఁ డీ పావనస్వాంతుండు పురుషోత్తమఖ్యాతిఁ బొందుటరుదె
శ్రీసర్వమంగళాంచితదేహుఁ డీ ధన్యుఁ డసమాంబకస్ఫూర్తిఁ బొసఁగుటరుదె
యనుచు జనులెంచఁదగు విపక్షావనీశ । రాజ్యలక్ష్మీ కచాంతరగ్రథిత కుసుమ
దామ సౌరభకలితహస్త ప్రశస్తుఁ । డార్యవినుతప్రభావుఁ డయ్యలఘుయశుఁడు.

క. ఆరూఢరూప విభ్రమ । తారుణ్యదయా పతివ్రతాధర్మసదా
చారాన్విత యతనికి సుద । తీరత్న మనంగవతి నుతింపఁదగు ధరన్. ౪౪

క. క్షితిఁ జంద్రమతి నరుంధతి । రతి భారతి హైమవతిని బ్రకటించు నెడన్
బ్రతిచెప్పనొప్పు నమ్మద । వతి పాతివ్రత్యవైభవంబున నెంచన్. ౪౫

సీ. అఖిలరాజన్యకన్యామౌళిరత్న నీరాజితాంఘ్రిద్వయ ప్రాభవంబు
దివిజనాయక పురంధ్రీమణీగణనీయ భూరివైభవధుర్యభోగమహిమ
రంభోర్వశీరతిప్రముఖ దివ్యాంగనావిజయాఢ్య సౌందర్యవిభ్రమంబు
త్స్మరమానసవృశక్షమా ఘనైశ్వర్యవిభ్రాజిత ప్రబలసౌభాగ్యగరిమ



మొదలుగాఁగల సద్గుణంబులఁ బొసంగి । ప్రాణేశ్వరునకుఁ బట్టపురాణియగుచు
వన్నెకాంచియు నయ్యబ్జవదన దలఁకె । నంత సంతానమెఱుఁగని చింతఁదగిలి.

క. పతియనుమతఁ గరి నమ్మద । వతి చతురతవంధ్యతాపవాదము మాన్పన్
మతిఁ బూని వ్రతకాంతో । చితమహితాచారసరణి దినదినమెలమిన్. ౪౭

సీ. ప్రొద్దుప్రొద్దున లేచి పుణ్యహ్రదంబుల హాళితో జలకంబు లాడి యాడి
ముత్తైదువులఁ బ్రియంబునఁ బూజగావించి నవనవఫలవాయనము లొసంగి
క్షితిసురోత్తములకుఁ బ్రతిదినంబు నపూప ఘృత పాయసాన్నులఁ దృప్తి సలిపి
గృహదైవతముల మిక్కిలిభక్తిఁ బ్రార్థించి నానావిధాభ్యర్చనము లొసంగి
వ్రతములొనరించి శకునసంగతులు దెలిసి । సిద్ధమునిబృందములను వీక్షించి ప్రముకి
సతులుగావించు యత్నము లెలుపుచుండె । నమ్మృగేక్షణ సంతాన మాత్మఁగోరి.

ఉ. అంతట నొక్కనాఁడు కమలాక్షి నిజేశునితోడఁ గూడి యే
కాంతమునన్ వసింప రతికాంత రణాంత నితాంత తాంత నే
త్రాంతములందు నిద్ర గలయన్ వలెంచిన నొక్కవిప్రుఁ డ
య్యంతికిఁ గేతకీకుసుమమిచ్చెఁ గలం గలకంఠి వేడుకన్. ౪౯

చ. అలరుచు మేలుకాంచి హృదయప్రభుతోనను నాథ యీ యెడం
గల నొకబ్రాహ్మణుండు నవకైతకసూనమొసంగె నానతం
దెలిసి నృపాలుఁ డంత సుదతీ వినుమీతఁడు వాసవుండు మా
కులగురుఁ డొక్కకన్యగలుగుం బ్రసవంబునొసంగెఁ గావునన్. ౫౦

క. కలయిది నిక్కల కన్నియ । కలుగుం గలకంఠి నమ్ముఁగాఁదగు నీ నో
ములఫలము చేరెననవిని । యలరెననంగవతి నిక్కమగునని కడఁకన్. ౫౧

గీ. వ్రతఫలములు పచేళిమప్రభ వెలుంగు । నట్లు శుభములు ప్రత్యక్షమైనయట్లు
నంతలోఁ గొన్నినాళ్ళ కయ్యబ్జముఖికి । సన్నసన్నఁగ వేకటి చిన్నెలమరె. ౫౨

సీ. చకచకద్యుతులచే ముకురంబులనమించు చెక్కులవెలిచాయ చొక్కులమరెఁ
గనకసారసకోరకములపై నెలకొన్న భ్రమరంబులనఁ గుచాగ్రములు మెఱసె
నంబరస్ఫూర్తి విడంబించునరిపేదకౌ నంతకంతకుఁ గానవచ్చెఁ
దతజఘనద్వయోన్నత జాఠరభరంబు మందయానమునకు నంద మొసఁగె
నసమశరతంత్రములమీఁద విసుగుదోఁచె । సఖులతో ముచ్చటాడంగ సైఁచదయ్యెఁ
బుల్లపుల్లనిరుచులపై బుద్ధిపొడమెఁ । బ్రథమగర్భోదయమున నప్పద్మముఖికి. ౫౩

క. క్షితిగంధవతి నిజంబని । మతిఁదలఁచి తదీయగంధమానితరుచిచే
నతులక్ష్మాఖ్యయాసతి । యతిచతురతఁ గొను మృదూర్జితాహారంబుల్. ౫౪

గీ. ఉవిద బలుతొడవులు దాల్పనోపలేక । విరులుగోసిన పూఁదీవెకరణిఁ దనరె
నళినలోచన జఠరమున్నతి వహించె । ముద్దరాలికి నీళ్లాట ప్రొద్దులయ్యె. ౫౫.

చ. శుభదివసంబునందుఁ బరిశుద్ధముగా గ్రహరాజులుచ్చలం
దభిమతలీలనుండఁ దరళాయతలోచన గూఁతుఁ గాంచె నం
దిభనిభయానతైన ధవళేక్షణలందఱు సంతసంబుతో
రభసగతిం దదీయ గృహరక్షయొనర్చి రహార్యధైర్యలై. ౫౬.

వ. అప్పుడు. ౫౭.

సీ. మణిగణద్యుతికి మార్మలయు దీప్తుల రేయుఁబగలును వెలుఁగుదీపములగములు
నిరుచక్కియలదారికేలమిఁ గాఁపుగ నల్లి పొట్టుగప్పిన యగ్గిపొగలతెగలు
ద్వారమూలముల నందముగ నుంచిన దీర్ఘ శాకోటకుట సమిత్సముదయములు
నిది సందుదినమందు రాదసేయఁ దగదని పలుకు వృద్ధాంగనాపరిజనములుఁ
గలిగి తత్తత్ప్రదేశ సంఘటితపూర్ణ । కుంభ రంభాతరుస్తంభ జృంభమాణ
సితవితాన పతాకాభినుతవిభూతి । గాంచి యొప్పారెఁ దత్సూతికాగృహంబు.

సీ. తారహారములతోఁ బోరాడు వెల్లుల్లిపూసపేరులు కంఠమునఁ జెలంగఁ
బద్మరాగంబులపగిదిఁ జొక్కపువీడియములతో నెనసి దంతములు మెఱయ
ధగధగ వెలుఁగు నిద్దపుఁ జెక్కుటద్దము పొంతఁ గాటుక యుక్కుబొట్టు వెలుఁగ
ముఖచంద్రమునిమీఁద మొనసిన కార్శ్యంబుగతి నీలి వాసెనకట్టు మెఱయ
సంతసయ్యెంతి పచ్చిబాలింతపొబగు
భువనమోహనమగు వేషమునఁ బొసంగెఁ
దరుణులెల్లను వృద్ధోదిత ప్రకార
మునఁ బురిటివైభవము సేయు వెనుకవెనుక. ౫౯.

క. వాసవువరమునఁ గలిగిన । యాసుదతీరత్నమునకు నవనీశుఁడు దా
వ్రాసెను నామం బీసతి । వాసవదత్తయని బుధులు వర్ణనచేయన్. ౬౦.

మ. ప్రతిపచ్చంద్రకళావిశేషరుచిఁ దద్బామాలలామంబు తాఁ
బ్రతిభన్ బ్రత్యహము న్వివృద్ధగతిచే రంజిల్లెఁ దద్భావముల్
మతి భావింప వచింప నెంచుకొనఁగా మాబోంట్లకు న్శక్యమే
రతి రంభాది సురాంగనావితతి మీఱంజాలుఁ దద్వైఖరుల్. ౬౧.

క. మనసిజుని మంత్రదేవత । యనఁగను దనరారె శైశవానంతర యౌ
వనలాభ విభవమున న । వ్వనితామణి దినదినప్రవర్ధితరుచులన్. ౬౨.



చ. కొప్పఘనంబు చూడ నలక్రొమ్ముడికన్న సమున్నతప్రభ
న్నొప్పగుఁ గన్నుదోయి కచవిభ్రమలోచనరోచికెక్కుడై
యొప్పగుఁ జన్నులున్నతి సముజ్జ్వలకైశికదృక్కుచ ప్రభ
ల్గప్పఁ బృథుత్వవైభవముఁ గాంచి కటిస్థలి లేమ కెంచఁగన్. ౬౩.

సీ. మరునినీలపుటురుల్మానినీమణికురుల్గనకభవ్యవిలాస కలికినాస
శశివిభోల్లసనంబు జలజాక్షిహాసనంబు పద్మంబులోగోము పడఁతిమోము
వజ్రరుక్కాంతము ల్వనజాస్యదంతము లమృతంపుబావి తన్వంగిమోవి
యసితోరగము గేరు నళివేణినూగారు విన్నుగల్వఁగఁబూను వెలఁదికౌను
తరళతరవీచికావళు ల్దరుణివళులు
భూమిచక్రజయార్భటి భామినికటి
సరసిజశ్రీపదములు సుందరిపదములు
తారకలజోళ్లు నవలతాతన్విగోళ్లు. ౬౪.

వ. ఇవ్విధంబున నొప్పు నవ్వనితారత్నంబు రత్నసానుసానుగతప్రభయుంబోలె సుజాతరూపవిభ్రమయై శరత్కాల దినాంతలక్ష్మియుంబోలె సముల్లసత్తారకాలంకృతయై సత్సభాస్థలియుంబోలె సంస్తూయమాన ద్విజపంక్తివైభవయై లావణ్యరసాయనసిద్ధియో యన శృంగారోదయస్థానమో యన మదనజయపతాకయో యన సంసారభిత్తిరచితచిత్రరేఖయో యనఁ ద్రైలోక్యసౌభాగ్యలక్ష్మీనృత్తరంగస్థలియో యన ననన్యసామాన్యవిలాసలీలచే నలరుచు మదనమంజరియు వసంతసేనయుఁ దరంగవతియుఁ జిత్రరేఖయు విలాసవతియుఁ మదనమాలినియు రాగలేఖినియుఁ గాంతిమతియు యూధికయు ననంగరేఖయు ననంగఁ బఱంగు చెలికత్తియ లమందానందకందళిత హృదయారవిందలై యాటలం బాటల వినోదకథాప్రసంగంబులం బ్రొద్దుపుచ్చుచుండ నంత నొక్కనాఁడు వన్యావిహారంబుగోరి యక్కన్య చందన మందార సిందువార కందరాళ మాకంద పిచుమంద పూగ పున్నాగ నాగ వకుళ చాంపేయ పాటల భూర్జ సర్జ ఖర్జూరార్జున మాతులుంగ లుంగ లవంగ సారంగ నింబ జంబూదుంబర శింశుపాశ్వత్థ శిరీష పనస పిప్పల వట కుటజాది నానావిధ తరుచ్ఛాయాలవాలంబును వాచాల శుకపికశారికానికర కలకలధ్వాన బధిరితరోదోంతరంబును బల్లవోల్లసిత మల్లీవల్లీవేల్లిత మంజునికుంజగుంజన్మధువ్రత ఝుంక్రియాగాన మనోహరంబును నగు నుద్యానవనంబుఁ జేరం జనుచున్న యవసరంబున. ౬౫.

శా. కాంతంబై సుమనోమనోజ్ఞ నవమాకందద్రుకాంతారసం
క్రాంతానంత మనోజసైనికపటూగారావళీభూతకుం
జాంతస్సంతతపల్లవోదయ దిదృక్షానందిత స్వైరిణీ
స్వాంతంబై తనరెన్వసంతము లతాంతాలంకృతానంతమై. ౧౯.

సీ. ప్రబలకుంజవ్రజపటమందిరములొప్ప సుమనోరజోవితానములు మెఱయ
మలయసమీరడింభకు లూడిగముసేయ నవ్యకాంచన భూషణములు వెలుఁగఁ
బరభృత మాధవప్రతతులుగొనియాడ లతికాంగనల నాట్యగతులు చెలఁగఁ
దతభృంగగాయకప్రతతి గానముసేయ శుకశారికాదిసైనికులుగొలువ
వనధరాస్థానమున మాధవప్రభుండు। నిగ్రహానుగ్రహక్రియానిపుణుఁ డగుచు
మధుపమాలిన్యజాతుల మదమడంచి। యధికతరులకుఁ బచ్చడా లపుడు గప్పె.

సీ. సహకార సుమపదృక్ప్రకనీనికలు వాసంతికాలోచన చలవిస్ఫుర
కజ్జలప్రభ లనంగజ్వలజ్జ్వలన ధ్వజములు కుంజాకరస్థగిత శక్ర
మణులు జాంబవసుమమావిగ్రహంబులు చైత్రభాగ్యవిహీన జాత్యకీర్తు
లాలోలవనసరో నీలోత్పలదళంబు లరుణప్రసూన గుంజాగ్రరుచులు
కనకకోరక దీపశిఖాకలాభి। హాలిసముద్భూత ఝుంక్రియైకార్తనాద
సంచరిష్ణు కృశధ్వాంతశాబకములు। చెలఁగె షట్పదములు వనస్థలులయందు.

గీ. విరహతతిమీఁద దండెత్తు మరునిజయ। శంఖములుపట్టి పూరించు జాడదోఁప
నలరె మధుపములపుడు ప్రత్యగ్రవిచికి। లాగ్రములమీఁద మధురసం బానలిచి.

క. బత్తిగలమగఁడు చైత్రుం। డత్తఱి వన్యావధూ కచాంతరసీమన్
హత్తుకొనఁజల్లి కూర్చిన। ముత్తెములన సిందువారములు గనుపట్టెన్. ౨౦.

చ. అసమశరప్రతాపదహనార్చి రుదంచితకీలలోయనన్
గిసలయముల్చెలంగ మరుకీర్తులకైవడి వానిమీఁదటన్
బ్రసవములొప్ప మారునిప్రభావముకైవడి నున్నతప్రభా
విసరముచెంగలింప వనవీథులఁ జాతములొప్పెనయ్యెడన్. ౨౧.

క. మావులుగొన్ని మనోజుని। మావు లనందనరెఁ బత్రమానితరుచిచేఁ
గ్రోవులు మదనుని కప్పురపుఁ। గ్రోవులన న్వలపు దెలిపెఁ గుసుమప్రభలన్. ౨౨.

ఉ. ఆసమయంబునందు సఖులందఱు గుంపులుగూడి కొల్వ న
వ్వాసవదత్త భాగ్యవిభవంబుదలిర్ప మనోజరాజ్య ల
క్ష్మీసుకుమారలీల విహసింపుచుఁ బువ్వులుగోయఁబూని వ
న్యాసరణి న్మనోహరవిహారముసల్పఁదొడంగె వేడుకన్. ౨౩.



క. వనమా యిది చైత్రునిజే। వనమా పికనికరసుకరవనమా స్మరభా
వనమా నవయువజనపా। వనమా రతిభాగ్యభాగవనమా యనుచున్. ౨౪.

సీ. ఘుమ్మఘుమ్మనఁ గమ్మదెమ్మెర ల్పుప్పొడిదుమ్ము రేఁచఁగఁ దావిగ్రమ్మఁ జోట
నల్లిబిల్లిగ నల్లసిల్లుసల్లలిత సంఫుల్లమల్లీ సుమవల్లులకడ
కెన్నఁజెన్నగు చిన్నచిన్నగున్నల జాడనున్న ప్రసన్ననిసుగపొన్నఁదరిఁ
గొదమతుమ్మెదలు పై మొదలుచరొదసేయఁ బొదలుబల్గురివింద పొదలనీడఁ
గంతుగొని యాడి పాడుచు గంతులిడుచు
రంతుసేయుచుఁ గొలఁకులపొంతఁ జనుచు
మంతనములాడి యువిగొన్ని వింతలనుచు
సంతసమునఁజరించి రయ్యింతులచట. ౨౫.

సీ. ధీరద్విరేఫ ఝుంకారప్రసవగుచ్ఛ భారద్రువాటీ విహారములను
మారలీలోన్మత్త కేరళికుచగంధసారసంయోగ సత్కారములను
సారవన్మలయ శైలారబ్ధనందన శ్రీరమ్యపాద సంచారములను
సారసోదార గంభీరవాఃపూర కాసారసేవా సదాచారములను
దృప్తుఁడై తృప్తుఁడై దీప్తివ్యాప్తిఁ బొదలి
యలసి మెల్లనవచ్చోటి కరుగుదెంచె
నతను కేళీరతాతనుసుతను సుతను
ఘర్మశీకరహరుఁడైన గంధవహుఁడు. ౨౬.

సీ. శ్రీఖండ తరుషండ శేఖరాలంకృత కిసలయకంప నాంకితరయములు
ఘనసలవంగ కేసరజాలసంపాదనాయత్త చతురవిద్యాస్పదములు
సలిలకేళీరత లలనకాంతాతనూ సౌరభస్ఫూర్తి విస్తారితములు
తతరతశ్రాంత కాంతాకుచాంతర మౌక్తికస్ఫుట ఘర్మశీకరహరములు
మలయమరుదంకురమ్ము లమ్మానవతుల
సతతవన్యావిహారజ శ్రమమువాయ
నల్లనల్లనఁ జనుదెంచె నుల్లమలర
ముమ్మరమ్ముగఁ బూదావిగ్రమ్ము కొనఁగ. ౨౭.

చ. వదనముఁజూపఁ జంపకము వావిలిమారొక్కనఁ గ్రోవికౌఁగిటం
బాదవఁగఁ బాదఁబ్రేంకణము పొన్నహసింపఁగ నయ్యశోకముం
బదమునఁ దన్నఁ గేసరముత్తై నుమియం బలుకంగ గోఁగుఁ జే
గదలుపమాని చూడఁ దిలకంబును గ్రొన్ననలిచ్చె వారికిన్. ౨౮.

వ. అట్టియెడ. ౭౯.

క. ఒకరొకరిఁ జీరి కేరుచు । ముకుళంబులు విరులుఁ జూచి ముదమందుచుఁ జే
రికనున్న చెలులఁ గనియ । మ్ముకురానన మధురవాక్యముల నిటు పలికెన్. ౮౦.

రగడ. మదనమంజరికంటివె యీమదనమంజరి సొగసు పెంపులు
పొదలరొద లొనరింపుచును మదిఁ బొదలుచున్నవి తేఁటిగుంపులు
కదలికలు లేకున్న వెంచఁగఁ గదలికలమొత్తమ్ము లిచటఁ
బదరజమ్ములు గ్రమ్మఁ దిరుగుచుఁ బదర నేటికి నాలియచ్చట
నాగమల్లెలుగలిగె నల మదనాగరాజసమానయానకుఁ
బూగములపైఁ బ్రాఁకుతీఁగెల పూగములు సాధించుమానకు
చిన్నలల్లవె యెన్నఁ జెన్నగు చిన్న ప్రాయపు తీవినలరెడుఁ
గన్నెరలకై యురుగనేటికిఁ గన్నెరహితో నిందుఁ గొఱలెడు
వేయునేటికి విరులకై నీ వేయుపాయము సేయఁగావలె
రాయనంటులనీదలకు వలరాయనికిఁ జెరువియ్యఁగావలె
రంగరంగశుకంబులవె సారంగలోచన మరుబలంబులు
రంగదాకృతి నొప్పెనవె నారంగభూజములను ఫలంబులు
రాకురాకు పరాకు కెందలిరాకు చిమ్మఁగ రాము పదరకు
కాకుగాకు ఫలంబుగను దన కాకు రంగట నిల్వు బెదరకు
పొలఁతిరో మలయానిలములొక పొలఁతి పుప్పొడి గుమ్మ రేఁచను
వెలఁదియయ్యెలఁ బన్ను పూఁదీవెలఁదికంబుగ మంచు దోఁచెను
డంబుగాఁ జిగురాకుగమి పగడంబుఛాయలు గాంచి మించెను
గంబుకంఠిరొ మెఱసి యూకనకంబు వలపులు గ్రుమ్మరించెను
రాఁగతనమున నొరులవిరులకు రాఁగడంగిన నేనెరాఁగల
రేఁగఁ దోలకు రేఁగులను జెలరేఁగమూఁగిన తేనెయీఁగలఁ
గంచకున్నది సిరులతో మాకందబృందము కుసుమపుంజము
మందయానరొ చూడఁదగు సుమమందశర్చెలతా నికుంజము. ౮౧.

క. అనుచుం జెలులిచ్చు నన । ల్గొనుచు న్వనవీథిఁ గుసుమకోమలిదఱియం
జనుచు న్వలరాయనికృప । గనుచుండఁగ నంతఁ జైత్రు గర్వము సడలెన్. ౮౨.

వ. అనవిని శారిక శుకంబునవలోకించి ప్రశంసించి యనంతర వృత్తాంతం బెఱింగింపు
మనుటయు. ౮౩.



మ. పృథివీ భృద్వరధీర ధీరజనశాఖిస్తుత్య వాక్పత్యస
త్పథసాంతత్యవిహార హారధరణీభృత్ప్రాభవోద్యద్యశః
ప్రథమాలంకృతసార సారసముఖీప్రత్యగ్రసంభూత మా
న్మథసన్మూర్త్యవతార తారక నిధానధ్యాన చిత్తాంబుజా. ౮౪.

క. సింధుర సైంధవ వైభవ
బంధుర శ్రీవైష్ణవ ప్రబంధాంకిత చి
ద్గ్రంథర సాదర నీతియు
గంధరనిభమంత్రివర్య కల్పితకార్యా. ౮౫.

పృథ్వి. ధరాచరణ నూపురస్థగితరత్న రుక్పీఠకా
పురీవరణ వైభవస్ఫుటనికేతనా కేతన
స్ఫురన్నిజ చమూపరిస్ఖలితభూసురోద్యద్ధరా
పరాగపిహితాశ్రుసంభరిత శత్రుకాంతాననా. ౮౬.

గద్య. ఇది శ్రీవక్కలంక చంద్రశేఖర మహాకవిపౌత్ర భాస్కరసుకవిపుత్ర
విద్వజ్జన విధేయ వీరభద్రనామధేయ విరచితంబైన వాసవదత్తా
పరిణయంబను మహాప్రబంధంబునందు
ద్వితీయాశ్వాసము.

---

## తృతీయాశ్వాసము.

---

క. శ్రీయుతవైభవ హిందూ । రాయసురత్రాణబిరుద రామానవరా
మేయనిభ పూర్ణిమాసో । మాయితరుచిగేయ రాఘుమాధవరాయా. ౧.

వ. అవధరింపు మనంతరకథావిధానంబు శుకంబు శారికతో నిట్లనియె. ౨.

క. వన్యావిహారమున న । కన్యామణులలసి వేడుకన్ జలకేళీ
మాన్యమతి నుండఁగాఁ బద । విన్యాసమొనర్చె భువిని వేసవియంతన్. ౩.

శా. ప్రచ్ఛాయస్థల పల్లవాస్తరణ నిద్రాయోగ్యముల్ పాటలీ
గుచ్ఛాకల్ప మరన్మనోజ్ఞతరముల్ కూలంకషాభ్యంతర
స్వచ్ఛాంభః పరివేష శాద్వలములు పశ్చాద్భాగ సౌభాగ్యముల్
స్వచ్ఛందస్థితి గ్రీష్మవాసరము లెంచం దల్పిగాంచెన్ ధరన్. ౪.

సీ. వనముల దావపావకభూతి గనిపించెఁ బాటలముకుళవైభవము మించెఁ
బడమటిసుడిగాలి వడివడి వడఁదెంచె మదనుతూపులయేపు గొదవగాంచె
మధురసామోదంబు మధుపాళి నిగలించె సరసులకాగి విరసతజనించె
సినరథ్యవితతిధావన మందత వహించె సలిలచరస్ఫూర్తి సన్నగించెఁ
బథికవితతి తరుచ్ఛాయఁ బవ్వళించెఁ । బ్రాణితతి కెల్ల నాతపప్రథిమ నొంచెఁ
గరులుఁ గిరులును బడియలకడ వసించె । నవనిమండలి వేసవియాక్రమించె. ౫.

క. భ్రమరక్రమ సంభ్రమవి । భ్రమరమణీయములు మేపుర ప్రాగ్రంబుల్
ప్రమదావతంస లీలా । ప్రమదావహములు శిరీషపదములు పొలసెన్. ౬.

చ. సరసిజగంధి నీరార్తు జలశాల జనాళికి దప్పితీర్పఁగా
సరసుఁడొకండు పద్మముఖి చన్గవఁ గన్గొని యూర్ధ్వదృష్టియై
కరము వదల్చి నీరు తమకంబునఁ ద్రావఁగ నప్పొలంతి యా
పురుషు నిజాచుప్రేమ జలములనుధారనొసంగె నయ్యెడన్. ౭.

మ. జలపూరాతివిహారముల్ సుమవనీసంచారముల్ చందనా
చలసంభూతసమీరముల్ హిమలవాంచచ్చంద్రికాసారము
స్థ్వలసత్కుంజకుటీరముల్ దళికానిర్ముక్త కర్పూరముం
దలఁపన్ భోగులకుం బ్రమోదమొసఁగెన్ ధాత్రీస్థలి న్వేసవిన్. ౮.

శా. కాంతారత్నములయ్యెడ న్గనిరి తత్కాంతార కాంతావని
కాంతాక్రాంత తరంగరంగ దమలాబ్జాళీమిళత్సౌరభా



త్యంతాకృష్టమిళింద ఝాంకరణ గానానంద సంధాయకా
శ్రాంతశ్రాంతిహరాంబు దూషిత సుధాసారంబుఁ గాసారమున్.

సీ. కాదంబ కాదంబ కాదంబరుచిరంబు ధీవరధీవరాధిష్ఠితంబు
భ్రమర విభ్రమర విభ్రమర విద్యాంకంబు గురుసత్వ గురుసత్వ పరివృతంబు
సారస సారస సారస ధ్వనుతంబు చక్రాంగ చక్రాంగ సౌష్ఠవంబు
పానీయ పానీయ పానీయ విభవంబు నవకోక నవకోకనదయుతంబు
రాజిల వ్రాతకచ్ఛపరాజిలంబు । సమకరద్వంద్వవీచికా సమకరంబు
మధురకైరవ నిస్సర న్మధురసంబు । సారమతు లెంచ నచటి కాసారవరము. ౧౦.

క. సారసముఖు లయ్యెడఁ గా । సారము దరివిశిచి జిలుఁగుఁ జలువలతోడన్
వారివిహారము సలిపిరి । వారివిహారాంగరుచులు వశమేపొగడన్. ౧౧.

క. ఉత్పలములు మా నయనము । లుత్పలములకన్న నన్న నోహోయివిగో
మత్పదములు పంకజరుచి । మత్పదములు చూడుమనుచు మదిముదమొదవన్.

మ. అలులం బై కెగఁదోలుచుం గమలపత్రాంబుచ్ఛటల్ గ్రోలుచుం
గలువ న్గైకొన వ్రాలుచు న్సమదచక్రశ్రేణిపైఁ దూలుచున్
జలపూరంబునఁ దేలుచుం దరుణహర్షప్రాప్తిచేఁ గ్రాలుచున్
సలిలక్రీడయొనర్చి రిందుముఖు లుత్సాహంబుతో నయ్యెడన్. ౧౩.

సీ. బాలరో సీమించ వాల నన్నంటకుమని దూరమున నీఁదులాడి యాడి
శారికన్గవ మూయఁ జేరియున్నలతాంగి మామదోయిట నీటముంచి విడిచి
పిల్వఁ బిల్వఁగరాని పిల్లఁగల్వలఁ బూని విసరి దగ్గఱఁ జేర వెఱచి నిలిచి
కరపద్మకలితకంకణ ఝణంఝణలచేఁ గలహంసములతోడఁ గలనునర్చి
చండకరకాండమండిత పుండరీక । తండములఁ జెండు చెండాడి గండుమీలఁ
గేలఁగిలించి తేలించి నీలముంచి । నెలఁత లంభోవిహారంబు సలిపిరెలమి. ౧౪.

ఉ. లీలజలంబులం బ్రతిఫలించి కనుంగొననొప్పుచున్న యా
లోలకనీనికాకుల విలోచనముల్గని బాలయోర్తు మ
త్తాళిసమేత కైరవములంచుఁ గలంచిన నొక్కప్రౌఢ మే
త్మేలనినవ్వెఁ జూపరులు మెచ్చ వినోదముగాఁగ నత్తఱిన్. ౧౫.

క. శ్రీలలితశ్రుతిసీమలఁ । గ్రాలెడు కనుదోయి నీడగని వేఱొక నీ
లాళికచ దలఁచె వీనుల । నీలోత్పలయుగళి దగిలె నిజముగ ననుచున్. ౧౬.

మ. తనుసంసిక్త సితాంశుకావృతులతో ధారాళవార్వాహమో
హనలీలాలకజాలకాస్యములతో నంసద్వయాక్రాంతకం

పసిగూఢోరుపయోధరద్యుతులతోఁ బ్రవ్యక్తరూపాంగులై
తనుమధ్యల్బయలెక్క యాసరసిచెంతన్నిల్చి మోదంబునన్. ౧౮.

క. గడగడ నడుములు వడఁకఁగఁ । దడిపావడ లాడలెడలఁ దరుణులు నెఱుకల్
ల్బడఁబడఁగఁ గడఁకసన్నపు । నడుపులఁ దడిఁ దుడుచుకొనుచు మహితాకృతులై.

మ. పులకాంకూరము లుద్భవింపఁగ నవాంభోజాత పత్రేక్షణల్
వలిపెంబు ల్సవరించి సొమ్ములను దేవ స్మైనఁగై సేసి శ్రీ
చెలియుం గస్తురినామమున్ లలిఁ నసల వేవేల్సేయఁగా దిద్ది కెం
దలిరుంగైదువు జోదుఁగొల్చుటకు నుద్యత్ప్రీతి సంధిల్లఁగన్. ౧౯.

ఉ. పొన్నలనీడఁ బోకనునుబోదియ చెంగట మావిచేరువన్
గ్రొన్నన కల్మిఁ జెన్నలరు గొజ్జఁగి పూఁబొదరిల్లుచేరి యా
కన్నెలు కమ్మదెమ్మెరలు కుర్మకణంబులు గ్రోలుచుండ సం
పన్నలి సేతుకాత్మజు ప్రభావము భావమునం దలంచుచున్. ౨౦.

సీ. సిరిగన్న సురపొన్న విరులఁ దిన్నియఁ జేసి జగతి గొజ్జఁగినీరు చల్లి యలికి
రంగుగాఁ బుప్పొడి రంగవల్లి ఘటించి కలువపూసింగంపు గద్దెనిలిపి
కనకంబుచే మరుఁ గావించి యందుంచి నన దేనె నభిషేచనంబొనర్చి
నానావిధ ప్రసూనంబులఁ బూజించి భ్రమరాళి ధూపధూమముగఁ జొనిపి
కిసలయంబుల దీపము ల్వొసఁగొనర్చి । పరిపచేళిమవినిపతత్ఫలరసంబు
భావభవునకుఁ బ్రీతినర్పణము చేసి । మొందఱవసించి మ్రొక్కుచు ముగ్ధలపుడు.

వ. ఇట్లు నుతులొనర్చిరంత. ౨౧.

గీ. వందనము మార యిందిరావరకుమార । దండము మనోజ పద్మబాంధవసుతేజ
శరణు భవదూర శంబరాసుర విదార । నతి యువధ్యేయ రతిసతీధృతిసహాయ.

గీ. ఆత్మభవుఁడ వజుఁడ వసమాంబకుఁడ వీవు । గాన నిన్నుఁ గొల్వఁ గలిగె మాకు
మూఁడుమూర్తు లేకమూర్తియౌ నప్పరం । జ్యోతి హృదయసరణిఁ జూచుమహిమ.

క. అనియారీతి మృగీలో । చన లనుపమవాక్ప్రసూన జాలంబులచే
మనసిజు నర్చింపుచు న । ద్దిన మానందాంబురాశిఁ దేలిరి కడఁకన్. ౨౪.

మ. యువతీవ్రాతము చేరి కొల్వఁగ మహోద్యోగంబుతో నట్లు వా
సవదత్తా లలనావతంసము ప్రియేచ్ఛన్మన్మథారాధనో
త్సవము ల్సేయఁగఁ జూచి తజ్జనకుఁ డుత్సాహంబుతోఁ బెండ్లి వై
భవ మిక్కన్యకొనర్తు నేనని దృఢప్రారంభుఁ డయ్యెన్మదిన్. ౨౫.

వ. అంత. ౨౬.



గీ. చెలువుమీఱంగ శృంగారశేఖరుండు । నపుడు వాసవదత్తా స్వయంవరమున
కవనిఁ గల రాజులను బిల్వనంపి కుసుమ । పురముఁ గైసేయ నతనిఁ బురమునందు.

ఉ. కట్టిరి మేలుకట్లనఁటికంబములున్ జలపూర్ణకుంభము
ల్దట్టము చేసి ద్వారములఁ దాపిరి గోడలఁ జాలసున్నము
ల్వెట్టిరి మట్టుమీఱఁ బురవీథులఁ బౌరులు సంభ్రమంబుతోఁ
బట్టపు రాజుపట్టికి శుభం బొనఁగూడెనటంచు వేడుకన్. ౨౯.

సీ. కస్తూరితోఁ గూర్చి కలయంపి చల్లిరి హిమవారి వజ్రకుట్టిమములందుఁ
జెలఁగి జవాదిచే నలికి ముత్తెపుమ్రుగ్గులిడిరి మేలిమిచాయ గడపలందు
మణితోరణము లభ్రమణితో రణము సేయఁ గట్టిరి శృంగాటకములయందుఁ
దత పురందర ధనుర్ధామధ్వజంబులు నిలిపిరి రాజమందిరములందు
ఘుగఘుగాయిత సౌరభస్ఫురిత విలస । దగరుధూపంబు లందంద నెగడఁజేసి
రమలమణిహర్మ్య వాతాయనములయందుఁ । బ్రభువరాజ్ఞానుమతి చేతఁ బౌరులంత.

క. హయకుంజర రథయుతులై । రయమునఁ జనుదెంచి రఖిలరాజకుమారుల్
ప్రియమున వాసవదత్తా । స్వయంవర మహోత్సవంబు సాగిన యెడలన్. ౩౦.

సీ. ఆంధ్ర ఘూర్జర కరూశాంగ వంగ వరాట కోసల కుంతల క్షోణిపతులుఁ
గురు విదర్భ కళింగ కొంకణ టెంకణ మగధ బర్బర లాట మనుజపతులు
సౌరాష్ట్ర మాళవ శక సింధు నేపాళ కేరళ కర్ణాట ధూరమణులు
సౌవీర మత్స్య పాంచాల ద్రవిడ మద్ర కేకయ చోళ ధాత్రీకళత్రు
లతులబలయుతులై చమూపతులు గొలువఁ । బ్రాభవము మీఱఁ గుసుమపురంబుఁ జేర
నతిరయంబునఁ జనుదేర నపుడు ప్రేమ । చెంగలించంగ శృంగారశేఖరుండు. ౩౧.

సీ. తురగరింఖాసముద్ధూత ధాత్రీపరాగములు పురంబెల్లఁ గప్పుకొనఁగ
గిరిశృంగ నిభమదద్విరద బృంహితములు ఘనఘనస్వనముల కరణిఁ దనర
వీరకాహళ శంఖ భేరికారావము ల్బాణభోజీధుల బోరుకలఁగఁ
గింకిణీటంకార సంకులధ్వజయుత స్యందనంబులు జనానందమొసఁగ
నెదురుగాఁ జని మదిముదమొదవ నృపులఁ । దనహజారమునకుఁ దెచ్చికనకమంచ
సంస్థితులఁ జేసి యత్యంత సంభ్రమమునఁ । బరిజనంబులు గొలువ వైభవము మీఱ.

మ. కొలువై యట్లు నృపాలశేఖరుఁడు కోర్కుల్మీఱ ధాత్రీజనం
బులతో సైఁగ యొనర్ప వారలును సమ్మోదంబుతో నుండ లో
పలికిం బోయి తదాజ్ఞఁ దెల్పుటయుఁ దత్ప్రాసాదమార్గంబునం
గలకంఠీమణి రాక తేటపడె బంగారందియ ల్మ్రోయుటన్. ౩౩.

క. జనయిత్రి తనకు నృపనం । దనులవిధం బెఱుక పఱుపఁదగునుక ప్రౌఢాం
గనఁ జేరఁ గళావతి యనఁ । జనుదానిం బనుచుటయును సంరంభమునన్. ౩౪

సీ. చనుదోయిభర మానఁజాలనిచందాన గడగడవరిపేదకౌను వడఁక
రాకానిశాకర శ్రీకరాస్యంబున దరహాస చంద్రికా స్ఫురణమెఱయ
మరుచేత సురజాఱు కిరుసుకత్తియనంగ జంఘాలమైకీలుజడనటింప
గురునితంబద్వయీభరమనోహర యానమునకునోడి మదేభములు దలంకఁ
బదయుగంబున జాళువా పావలమర । మదనమంజరిమొదలైన సుదతులెల్లఁ
బసిఁడి బెత్తలచే బరాబరులుసేయఁ । దనజనకునాజ్ఞ వాసవదత్త వచ్చె. ౩౫

ఉ. వచ్చి పసిండిమేడ వెలివాకిటఁ గాంచన మంచసీమపై
నచ్చిగురాకుఁబోఁడి సకియల్ భజియింపఁగనుండఁ జూచి తా
రచ్చెరువంది రాకొమరు లాచెలువం బనిమేషతాప్తులై
యచ్చరభావమొప్పఁగఁ బ్రియంబునఁ జూచుచునుండిరయ్యెడన్. ౩౬

సీ. మదనుకృపాణి యీ మానినీమణివేణి మారుసింగిణు లీ మిటారిబొమలు
భావజుతూపు లీ పద్మాక్షిచూపులు శశిపతికీర్తి యీ యతివనవ్వ
వెడవిల్తుముకుర మీ విరిబోఁడి నెమ్మోము వలరాజుశంఖమీ కలికిగళము
కాముదుర్గంబు లీ కలకంఠికుచములు మరునిరథాంగమీ మగువపిఱుఁదు
ప్రసవశరుదంతికరము లీ కుఱఁతితొడలు
చిత్తజునికాహళంబు లీ చెలియజంఘ
లనుచుఁ బాగడుచుఁ దత్పదాయత్త చిత్త
వృత్తి యాదరమునఁ గొందఱధిపసుతులు. ౩౭

సీ. ఒకఁడు చేవంకిపైనుప్పు తామర కెంపు మగుడమోవియటంచు మద్దుగొనియె
నొకఁడు సౌవర్ణకందుక మింపువదన చన్నఁబోలునని యక్కునఁ ఘటించె
నొకఁడు లీలాబ్జంబు ముకురాస్యమోముతోఁ దులరాదనుచు గోరఁద్రుంచివైచె
నొకఁడు తాఁబెంచిన శుకి తలోదరిపల్కుఁ జాడఁబల్కెన చేయిచాచి పిలిచె
క్షితిపతులు వేడ్కనిటు చమత్కృతుల నలరి
యొకరొకరు తత్ప్రియాహితోద్యోగులయిరి
లలితచేష్టావిలాస లీలావిభూతి
నవ్వరారోహఁ జూపిన యాక్షణంబ. ౩౮

వ. మఱియును. ౩౯



మ. నను నానందముతోడఁ జూచినది యీ నాళీకపత్రాక్షి యిం
క నను న్నెవరియించు నీయబల వేడ్కన్నాదెసం బ్రేమ చే
సినదీయుంటి యటంచు రాకొమరు లక్షీణాశులై యుండఁగాఁ
గని యమ్మానినితోఁ గళావతి వివేకస్ఫూర్తితో నిట్లనున్. ౪౦

మ. వనితా చూడుము రాజసూనులను సౌవర్ణాసనాసీనులన్
ఘనతేజోజితభానులన్ త్రిజగతీఖ్యాలోల్లసద్దానులన్
వనజాతప్రతిమాననులన్ నిఖిలవిద్వద్గేయ సుజ్ఞానులన్
వినమత్కల్పసమానుల న్నిఖిల పృథ్వీజానుల న్వేడుకన్. ౪౧

వ. అని మఱియు సవిశేషంబుగా నెఱిఁగించందొడంగె. ౪౨

సీ. ధృతిరసాతలమేలు చతురుం డహీనాఖ్యుఁడగు మహాభోగి యీ ధార్మికుండు
ధనదుండు వరపుణ్యజనరక్షకుఁడు శంకరప్రియువాది యీ రాజరాజు
కుంభినీప్రియకారి గంభీరవేది మానవకుంజరుం డీ జనప్రభుండు
నుతలోక హితజీవనుఁడు మణిచాపరాజితుఁ డీ ఘనుండు విశేషరసుఁడు
ప్రతిభ వెలయించి వాహినీపతులఁ బెంచి । ప్రబలె సర్వజ్ఞమౌళి యీ ప్రభువరుండు
సాగరసహిత ప్రకాశుఁడై జగతి నెగడె । లోకబాంధవుఁ డీ మేటి లోలనయన.

క. లలనా యితండు మలయా । చలమేలు నృపాలుఁ డితనిసాంగత్యమునన్
గలవెన్నఁ జందనద్రుమ । చలకిసలచ్ఛాయఁ గ్రీడసలుపుట లెప్పుడున్. ౪౪

వ. మఱియునుంగలఫలంబు. ౪౫

క. ఏలాలతాంత డోలా । ఖేలాలీలావిహారకృత పుణ్యఫల
వ్యాలోల చందనాచల । బాలానిలసేవ గలదు పంకజనయనా. ౪౬

ఉ. ఈతఁడు సింధునాయకుఁ డహీనబలోన్నత జీవనప్రథా
ఖ్యాతగభీరుఁ డార్యవిదితాధికసత్త్వుఁడు వాహినీవిభుం
డాతతభూమిభృద్వరసమాశ్రయుఁ డెన్నఁగ వీనిమైత్రిచే
నోతరుణీ లభించునిఁక నూర్జితసౌఖ్యము లిచ్చఁగోరినన్. ౪౭

క. కేళీమనోజ్ఞ నవకం । కేళీకోరకిత నారికేళీవిలస
త్తాళీ తరుతలముల ముది । తాళీ విహరించు దర్పితాళీశితవై. ౪౮

సీ. ఈ రాజశేఖరుఁ జేరఁగోరితివేని యతనువిభూతి సౌఖ్యంబు దొరకు
నీ ధరేశుని చెల్మి కిచ్చగించితివేని కులగోత్రహిత గుణోజ్జ్వలత వెలయు
నీ వాహినీనాథుపై వాంఛయగునేని గాంభీర్యలావణ్య గరిమ యలరు
నీ సార్వభౌమున కాసఁజెందితివేని ధనదప్రియోన్నతి గనుట సులభ

మీ ద్విజప్రభు కౌఁగిటఁ జేరయుదేని । కలవునీతోడుస్సుప్రభాగౌరవంబు
లిప్తహాసేముఁ గామింప నిచ్చయేని । గలుగుఁ జంద్రకియానంబు కంజవదన. ౪౯
గీ. అనిక ళావతి రాజనందనులఁ జూపి । వారివిధములు దెలుప నవ్వారిజాక్షి
విని వినక రీతిఁ జూచిచూడని తెఱఁగునఁ । జనియె నందవ్వనిని గుతిసలుపదయ్యె
క. అంతనృపాలాత్మజు ల । య్యింతి మనంబెఱిఁగి యుడ్లకేగిరి లజ్జా
క్రాంతానను లై కంతు ల । తాంత శరాసారమునకు నగ్గంబగుచున్. ౫౧
ఉ. వాసవదత్తయు న్నిజనివాసముఁ జొచ్చి సఖుల్ భజింపఁగా
నాసమయంబునందు హృదయప్రభుఁ డెవ్వఁడొకో ప్రసూనబా
ణాసనమూర్తియై నను దయన్వరియించు ఘనుండటంచుఁ జే
రాసల నిద్రఁబోవఁ గల నన్నిశ నమ్మదిరాక్షి ముందటన్. ౫౨
సీ. సంపూర్ణపూర్ణిమాశశి హసింపఁగఁజాలు మొలకనవ్వుల ముద్దుమోమువాఁడు
దళదరవింద సౌందర్య నిధానంబులగు వాలుఁజూపుల సొగసువాఁడు
రదవజ్రరాజిపైఁ బాదలెడు సింధూరముద్రపోలికనొప్పు మోవివాఁడు
కౌస్తుభనిభమణి గ్రైవేయరుచులఁ జొక్కుపుఁజందమునమించు గళమువాఁడు
తలిరుటాకులఁబోలు పాదములవాఁడు । శ్యామసుందరమగు మేనిచాయవాఁడు
ధరణిపతిసూతి యొకఁడు ప్రత్యక్షమయినఁ । గన్నులలర విలోకించెఁ గలికి యపుడు.
మ. కని చింతామణి రాజరాజసుతుఁడౌ కందర్పకేతు ప్రభుం
డని సైరంధ్రులు చెప్పిరంచు మదిలో నారూఢిభావించి మే
ల్కని స్వప్నస్థితి నిక్కమౌననుచుఁ దత్కంజాతపత్రాక్షి యి
ట్లని వర్ణింపఁదొడంగెఁ జిత్తభవ బాణాసారమగ్నాంగియై. ౫౪
చ. మరుఁడొ జయంతుఁడో నలుఁడొ మాధవుఁడో ద్విజరాజొ కిన్నరే
శ్వరసుతుఁడో గణింప నరవర్యుల కెందులభించు నిట్టి సుం
దరత విరించి యెంచి ప్రమదావహరూప సుచారువిభ్రమ
స్ఫురణము కల్మి నొక్కయెడఁ జూపఁదలంచి యొనర్చెనో తనిన్. ౫౫
సీ. సోముఁడో పూర్ణిమాసోముఁడో సురసార్వభౌముఁడో యామహీపాలవరుఁడు
మారుఁడో గిరిజాకుమారుఁడో దనుజసంహారుఁడో యాసద్గుణాకరుండు
రాముఁడో భార్గవరాముఁడో రేవతీరాముఁడో యామహోద్దామయశుఁడు
మిత్రుఁడో నిటలాక్షమిత్రుఁడో వాణీకళత్రుఁడో యానిశ్చలస్వభావుఁ
డహహ తాదృశరూప రేఖాతిశయము । గలుగనేరదు సాధారణులకు నిజము
గరుడ గంధర్వయక్ష కింపురుష సిద్ధ । సాధ్యవరులకునైన నిస్సంశయముగ. ౫౬



సీ. మతిఁ గోరునే యిందుమతి యజక్ష్మాపాలు నతనిఁ గన్గొనుభాగ్య మబ్బియున్న
రంభ కాబేరిఁ జేరంగనూహించునే యతనిఁ గన్గొనుభాగ్య మబ్బియున్నఁ
బౌలోమి దేవతాప్రభునిఁ గామించునే యతనిఁ గన్గొనుభాగ్య మబ్బియున్న
దమయంతి నలుని బాంధవము లెక్కించునే యతనిఁ గన్గొనుభాగ్య మబ్బియున్న
ననుదినంబును మది ముదం బావహిల్ల
నతనిఁ గౌఁగిటనుండు పద్మాయతాక్షి
యదియె మరుచేతి పూబంతి యదియె యింతి
యదియె బుధనుత గుణధన్య యదియె కన్య. ౫౭
మ. అని చింతింపుచు నాలతాంగి స్మరచాపావిర్భవద్బాణవే
దన సైరింపక యద్ధరావరుని హృత్పద్మంబులో నిల్పి యో
గినిరీతి న్మననంబొనర్చుచు విలోకించు న్దిశల్మాటికిం
దనచెల్కత్తియలం గుఱించి యలుగున్ దైన్యంబు నొందు న్నగున్. ౫౮
వ. అయ్యవసరంబున. ౫౯
సీ. అస్తాచలాగ్రభాగారూఢ మందారజాతప్రసూన గుచ్ఛంబనంగఁ
జరదంగవిసరవాసరతామ్రచూడచూడాచక్రలోహిత రోచియనఁగ
సంధ్యాంగనా కుచాంచలచారు మకరికాపత్రయావక రసభ్రమయనంగఁ
గంధివల్లభ బాలికా కేలికాగృహప్రత్యగ్రరత్న దర్పణమనంగఁ
దరళతర వీచికాపరిస్ఫురిత చరమ । సలిలనిధిలీల విద్రుమసాలమనఁగఁ
బ్రబలనక్తంచరౌఘ నిర్దళనదక్ష । సమయ హరిచక్రమనఁగ భాస్వంతుఁడలరె.
సీ. సుమశరస్యందన స్యూతమాంజిష్ఠరాగధ్వజపటవిభ్రాంతియనఁగ
గగన మహాతటాకప్రాంత సముదితకోకనద ప్రభానీకమనఁగఁ
బశ్చిమాశావిభు ప్రాసాదలంబి చామీకర యవనికాలోకమనఁగ
వారుణీమత్త దృగ్వారుణీగండ మండిత మణికుండలద్యుతి యనంగఁ
గాలకరవాల విదళితఘస్రమహిష
రుధిరధారాప్రవాహసంరూఢి నలరె
నినుఁడు చరమాంబునిధి గ్రుంకు వెనుక వెనుక
డంబు మీఱంగ సాంధ్యరాగంబు మెఱసె. ౬౧
చ. దళిత తమాలజాలముల చాయ నిశాచరకోటిమేలు క
జ్జలరుచితోడు ధూమవిభుసారథి రేయెలనాగచూర్ణకుం

తలతలని రాజునొల్లక పాసెంబడు పద్మినిశాపమూర్తి ది
క్కులఁ బచరించెఁ జీఁకటి యకుంఠితలీల నిలాతలంబునన్. ౬౨.

సీ. తర్కింపఁజూడ నందనవనిగాఁబోలు గణనీయకాళికాకలన నొప్పి
మదినెంచ దుర్జనహృదయంబుగాఁబోలు దోషానుబంధసంతుష్టి గనియెఁ
బ్రకటింప వైశ్వానరస్ఫూర్తిగాఁబోలు నఖిలకాష్ఠాపహారాఢ్యఁ దనరె
గణుతింప దైత్యలోకప్రజ్ఞ గాఁబోలుఁ బ్రకటితతారక ప్రతిభ గాంచె
నన విజృంభించెఁ దిమిర మత్యలఘులీలఁ । ద్రిపురహరకంఠ కాళిమఁ దెగడికమల
వనినిదూర మధువ్రత వ్రాతచేహ । దీధితుల గేలిసేయుచు దిక్కులందు. ౬౩.

సీ. నిరతాధ్వజ శ్రమోద్ధురభాను హయముఖోద్గతఫేనఖండ శంకావహములు
తాండవోచ్ఛల దుమాధవజటాతటనట ద్గంగాంబుకణవిభాసంగతములు
ధారుణీభరభుగ్న దంతావళోద్గీర్ణ కరశీకరచ్ఛటా సురుచిరములు
వియదిందిరాకుచవితతహారావళీ ప్రచురముక్తాఫల రుచియుతములు
కాలయోగీంద్ర విలిఖిత గగన ఫలక । సురుచిర ప్రణవాక్షరశోభితములు
తిమిరదైతేయ దంతపఙ్క్తిస్ఫుటములు । చుక్కలంబరపదమునఁ జూడనయ్యె.

శా. ధ్వాంతశ్యామల ధూమధూమహిత సంధ్యారాగవహ్నిప్రభా
క్రాంతాకాశ శరావమధ్యరజనీకాంతా కరాంతోద్ధతా
త్యంత ప్రస్ఫుటలాజ విభ్రమదశుభ్రాకార సందీపితా
శాంతంబై గనుపట్టె ఋక్షనివహం బక్షిద్వయీ పర్వమై. ౬౫.

సీ. క్షణదాంగనాకరోచ్ఛలిత ప్రవాళ కందుక మంగభవహేమ ముకుర ముదయ
శైల మందారగుచ్ఛము నభశ్శ్రీశ్రుతిమణికుండలము శతమన్యుదిగ్వ
ధూఫాల నిహితబంధూకప్రసూన మంజులబిందుతిలక మస్తోకఘుసృణ
రసలిప్తసంధ్యాఖ్య బిసరుహలోచనాస్తనకలశము శచీసౌధశిఖర
భాసమాన సువర్ణకుంభంబు బాల
చంద్రబింబంబు లోహితచ్ఛవిని మెఱసెఁ
దిమిరములు జాఱి దిక్కులఁ దెలివిచేరఁ
గుముదములునిక్క మదచకోరములు చొక్క. ౬౬.

సీ. గగనతాపసవరాగ్రప్రతిష్ఠిత శుభాకర గురుస్ఫటిక లింగంబనంగ
వ్యోమసౌధవిటంక సీమాంతరాధిష్ఠిత శ్వేత పారావతంబనంగ
నంతరిక్షసుధార్ణ వాభ్యంతరోత్థశాశ్వత దక్షిణావర్తశంఖమనఁగ
నాకాశధాతు వాదారూఢబుద్ధిమజ్జటిలాత్త నవరసఘుటికయనఁగ



నభ్రదర్వీకర ప్రభూతాండమనఁగ । నరుణరుచివాసి యుదయాచలాగ్రశిఖర
సితమణిద్యుతితోనొప్పె శీతకరుఁడు । ఒలుతవెన్నెల దిక్కులఁ జెంగలింప. ౬౭.

చ. స్మరుధవళాతపత్రమొ నిశాయమునాపులినంబొ ప్రాగ్దిశా
సరసిజలోచనాకరవిసారిసితాంబురుహంబొ నిర్జరే
శ్వరగజరాజకుంభమొ ప్రశంసయొనర్పఁగనంచు భూజనుల్
సరసిజవైరిఁ గాంచి మది సంతసమందుచునుండి రయ్యెడన్. ౬౮.

గీ. అంకమొప్ప నిశాకరుండపుడు మెఱసెఁ
జెలఁగి మన్మథ పట్టాభిషేకమునకుఁ
బ్రచురరుచిఁ బొల్చు దూర్వాంకురములతోడ
సమరుకలధౌత పూర్ణకుంభమొయనంగ. ౬౯.

చ. విరహకృశానురోప్యకృతవృత్తము మన్మథబాణ ఘర్షణ
స్ఫురదురువజ్రశాణము విశుద్ధమనుష్య మనోమరాళసం
చరణమనోజ్ఞసైకతము సాధునిరీక్షణ పుష్పలిట్సితాం
బురుహము చంద్రబింబము సముజ్జ్వలమై ఖరి నొప్పె నయ్యెడన్. ౭౦.

లయగ్రాహి.

తోరమగుసమ్మదముతో రమణుఁగూడి తమకోరికలు దీఱఁగఁ జకోరిక లభీష్టా
హారములు గైకొని విహారగతులు సల్పఁ దనివారని తమి న్విటుల వారయువతీ శృం
గారములఁ జెన్నగు నగారముల పొంతలకుఁ దార మకరధ్వజుఁ డుదారగతిబాణా
సారములు గూర్పఁగ రసారమణియైన సొబగై జలతశాటియనఁ గైరవి చెలంగన్.

వ. ఆసమయంబున. ౭౨.

సీ. అతులార్కమణి ఖచితానర్ఘతరతప్త హాటకచషకాంత రార్పితంబు
పానగోష్ఠీరత మానినీతనులతా ప్రాకామ్యదత్త సౌరభగుణంబు
కలశపారావార గర్భసంభూత సుధారస దాయాదతానుతంబు
పుంభావరతికళారంభజృంభిత సుదతీజనమన్మథోద్దీపనంబు
నగుచుఁ జేరెన్నికైన దివ్యాసవంబు । సమయమిది కొనుఁడనుచును సఖులు దెచ్చి
మదనిభయమునుభక్తియుఁ గదురనెదుర । నిడినఁ జేకొని త్రావుచు నింపుముఖులు.

మ. ఇది కర్పూర సుగంధ బంధురము భోగేచ్ఛానుకూలంబు ను
న్మదకాంతా పురుషాయితోల్లసన కృన్మారప్రతాపస్థి రా
భ్యుదయ ప్రాప్తఫలంబు సుమ్మనుచుఁ దా ముచ్చాడుచుం గాంతునిం
గదియం జేరి యొసంగిరాసవిర వేశ్యన్నెచ్చెలుల్ ప్రేంకఁగన్. ౭౪

క. మది నూఁదమొదవఁగ మదిరా । మదకారణజనిత మత్తమత్తద్విగంచ
ద్వదనారవిందయగు నాక । మదవతి పతియొదురనిలిచె మాద్యద్విభతోన్. ౨౫.

ఉ. కన్నులుమట్టుకై నువులకై వడిఁ ద్రిప్పుచు గొప్ప కప్రపుం
దిన్నెలఁ జిన్నిపాదములు దీకొననాడుచు సన్నసన్నఁగా
బన్నసరంబులూఁగ పెడపాటలు పాడుచు నుండ నొక్క కాం
తన్నరుఁ డొక్కరుండు ప్రమదంబునఁ గౌఁగిటఁజేర్చె నత్తఱిన్. ౨౬.

వ. వెండియుం బండువెన్నెలలు పుండరీకభవాండంబునిండి కుండలికుండలాఖండల వేదండ సితాండజ డిండీర పాండురాఖండరుచిమండితంబులై దిక్కాంతాకుంతలాంత నితాంత సంక్రాంత మల్లీలతాంత కాంతికాంతంబులై సాయంతన నటనాచటుల చిరంతనజటిల జటాపటల ఘటిత మందాకినీవాఃపూరంబుకైవడిఁ గైరవబంధు బంధురకరపరిస్రవత్సుధాసారాకారంబున ధారుణీభాగంబు గప్పనోయన నలరుచు యామినీభామినికి సమయవిధివశసంప్రాప్తంబగు చీఁకటి సోఁకుదయ్యంబు విడుచుటకు రాజ మహాయోగి నభఃపత్రంబునఁ గర్పూర గౌర నక్షత్రాక్షరచక్రంబువ్రాసి యభిమంత్రితభూతి దెసలంజల్లఁ బెల్లెగసి దివి నల్లుకొనెనోయన వెల్లివిరియుచు మానవతుల మానధనంబు కొల్లగొన నుల్లంబున నుద్యోగించి చంచరీకఝంకార గుణధ్వనులు మొఱయఁ దుంటవిల్తుంట పూవిటంబూపులొనగూర్చి కేర్చి యార్చి విజృంభించి జగజ్జయంబుగాంచుట నుద్భవించిన జయేందిర మందస్మిత కందళంబుల చందంబున నందంబులై మెఱయుచుఁ గుంద బృంద చందన మందార సుందరవనీ లతానికుంజంబులఁ బ్రియులుం దాము కందర్పక్రీడల నభినందించుచుఁ జంచలాక్షులకు చాంచల్యంబుల కంచిత కర్పూర సుగంధ చర్చలై పొదలుచు సాంద్రతర చంద్రకాంత కాంత కుట్టిమాట్టాలక సౌధవీథుల జాణలు హాలాలోలలీలల నైలుతటి కేలావతుల చేలంబులూడిసిన చెలతనంబున నుండు నబ్బాలికలకుం దుకూలంబులై మించుచు మధుర మధురస భరిత కుముద సముదయ చకచకలం బ్రకటింపుచు మహౌషధిదీపశిఖాదీపిత పల్లవశయన సముల్లసత్పల్లవంబులగు మంజులవంజుల కుంజంబులకుంజను జ్యోత్స్నాభిసారికామంజువాణులకుం జలోచన ధళధళల నొరవట్టుచుఁ దండతండంబులై పిండియాఱంబోసిన చందంబుననుండఁ జకోరికల కోరికలుదీఱఁ జక్కవకవ లుక్కుచెడి వెక్కసంబుగ నొక్కవడిం గూఁతలిడుచు విరహవేదనం జిక్కి పెక్కుఁ దెఱంగులం జొక్కంబులై యెక్కడంగాంచిన నక్కడంగల వృషశైలవాహినీవ్రాతంబులు వృషభ శైలాస గంగాప్రవాహంబుల ననుకరింప నరవరులెల్ల శంకరసామీప్యంబునం



బొదల జగంబు శ్వేతద్వీపరూపంబునం దీపింపనట్టియెడ నయ్యిందుముఖి కందర్పదశావశయగుచుఁ జెలిమికత్తియలం గికురించి శృంగారవనంబు చేరంబని. ౨౭.

చ. నెల వెదచల్లు వెన్నెలకు నిర్దయుఁడై మరుఁడేయు పువ్వుము
ల్కులకు వియోగినీజనము గుండెలుఝల్లనఁ గూయు గండుఁగో
యిలకు మధువ్రతాళులకు హెచ్చరికం గలహించి పల్కుచి
ల్కలకుఁ దలంకి యాకలువకంటి వనావని సాహసంబునన్. ౨౮.

సీ. చిగురాకుకైదువు వెగువతోఁ జేఁబూని తమకించి యురమునఁ దార్చఁదలఁచు
విరహాతికృశత భావింపక శమనదిక్పవనంబులో డిల్లపడకనడుచుఁ
గన్నెఱఁజేసి కూఁకలువేయు గయ్యాళి కోయిలఁగని మొకుర్కొనఁ దలంచు
మరు తుపాకీగుండ్ల మాడ్కి రింగునవచ్చు కొదమతుమ్మెదలకు నెదురనేగుఁ
జిలుఁగుఁ జెంగాఁకచీర చేనలవరించు । కొనుచు వెన్నెలవెల్లిలో మునుఁగఁబోవుఁ
గటకటా గాఢ మోహాంధకారవశతఁ । దమి మనంబున నాటి యత్తలిరుఁబోఁడి.

వ. ఇవ్విధంబున జవ్వని యవ్వనంబు బరిభ్రమించునెడ నబ్బిత్తరి చెలిమికత్తియ లత్తరుణిం గానక చిత్తంబునం దత్తఱిలి యత్తఱి. ౩౦.

ఉ. మేడలఁ జంద్రశాలికల మిద్దెల బావుల క్రేవ త్రోవలం
గ్రీడలొనర్చు చెంగలువరేకులు గప్పిన చప్పరాల బ
ల్లావుపులన్ దగన్వెదకి మానవతుల్ చెలిఁజూడ కంతటన్
జాడలువట్టి కన్గొనిరి జవ్వనిఁ బువ్వులతోఁటలోపలన్. ౩౧.

క. ఆ దతివఁగనిరి సకియలు । మందస్మితవదన మదనమంజరి వాబా
వందిత నృపసుందరి య । య్యిందుముఖిం గలయఁజూచి యిట్లనిపలికెన్. ౩౨.

ఉ. ఒప్పులకుప్ప నీవిచట నొంటిఁ జరింతువె యెందుఁజూచినం
బుప్పొడిదిప్ప తీరములుఁ బువ్వులతేనియవాఁక లయ్యయో
చెప్పఁగరాదుగా మధుపచేష్టలు మారుగుఱాలు పొంజులుం
గప్పుచువచ్చుఁ దారసిలుఁ గాలుని దిక్కుననుండి తెమ్మెరల్. ౩౩.

చ. వలువని సాహసంబు తగువా మగువా యిటు లొంటిఁ దోఁటలో
నిలుతువె కల్లనేరుచునె నెమ్మికినెమ్మి మదాళులే మదా
ళులు కలకంఠులే వనములోఁ గలకంఠులు నక్క టక్కటా
తెలియవుగాక యింతుఁ గడతేరుదురే యబలావళుల్ సఖీ. ౩౪.

వ. అని యివ్విధంబునంబలుకు మదనమంజరి పలుకులాలించి యంత నయ్యింతి కాంతవకుంతాక్రాంత నితాంతతాంతాననయగుచు మనోభవ మనోభవజ్వరపరితా

పంబున నున్న యిమ్మెయిఁ జెలులం జేరి యభిప్రాయంబు తెల్లంబుగాఁ దెలిపి పేర్వేరనో మదనమంజరి యో యనంగరేఖ యో వసంతసేన యో తరంగవతి యో మదనమాలిని యో రాగరేఖ యో యాధిక రూపకాంతిమతి యో చిత్రరేఖ యనుచుఁ బేరు పేరం బిలిచి విరహవేదనాపనోదమేదుర వినోదవాదకథా సాదర శిశిరోపచారం బులచేఁ దన్ను నిర్వహించుండనుచు మధుమదన మలయానిలంబుల మాటికిం దూఱుచుఁ గుసుమకిసలయమంజులవంజులనికుంజపుంజంబులకుం దారుచు విరహ గ్రస్తయుంబోలెఁ గుసుమబాణ బాణ జర్జరితయుంబోలె శృంగారభావనావిష ఘూర్ణితయుంబోలె యౌవనవనరాశి తరళతరతరంగ పరంపరాపరివృతయుం బోలె ననురాగ రజ్జుపరివారితయుంబోలె మలయానిలోద్ధూత చైతన్యయుంబోలె మూర్ఛాగృహీతయుంబోలె నున్నం గనితత్సఖీ పరివారంబట్టియెడ. ౮౫

సీ. వికచారవింద మాధ్వీకఝరీ పూరవారిత కాసారతీరములను
కర్పూర కదళికా కాననాభ్యంతర ఘనసారనిర్మితాంగణములకడ
మలయ మరున్నటచ్చల పల్లవోల్లసచ్చందన భూరుహచ్ఛాయలందుఁ
జంద్రకాంతోపలస్థలగళద్వారి ధారాయంత్ర శిశిరధరాతలములఁ
గుసుమకిసలయ విసరసత్కుంజములను । నచటనచట నాకింత ప్రౌఢ్రాటితాంగి
నుంచి సకియలు భయమునఁ బంచశరుని । కించుఁదనమునకును దమకించి మఱియు.

సీ. ఘనమోహకలుషమయ్యెను నాతిమానసం బరయఁ జందనపంకమలదరాదు
మదనాగ్నిసోఁకెను సుదతి మైదీఁగెపై మలయానిలంబు మేల్కొలుపరాదు
రాజయోగముఁ గోరు రమణిదృక్కుముదము ల్దవిలి పద్మాప్తుఁ దలఁచరాదు
ఇనునిఁ జింతించు జవ్వని మోముకెందమ్మిఁ బండువెన్నెలపాలు పఱచరాదు
చటులమకరాంకశరజాత జాతభీతి । విరహవిషపూరమున సుడిదిరిగితిరిగి
దరిగనుంగొనలేని సుందరినిఁ జూచి । జడధినీకబ్బనని భీతిసలుపరాదు. ౮౬

క. అని వనజనయన లనయము । మనమునఁ జెనుభీతిదనరు మదిరాక్షిని సాం
త్వన వచనరచన దినమ । బ్బనిభంబుగఁ గడపి రొకవిధంబుననంతన్. ౮౭

గీ. విరహజలరాశిఁ దరియించు వెరవులేక । మానినీమణి నిజసఖీమండలంబు
గొలువఁ బూఁబాన్పుపై మేనునిలిపి చంద్ర । మనసిజాదులకినుక నిట్లనియెనపుడు.

సీ. దోషాకర సమాఖ్యతో నుండుటయకాదు సత్ప్రభాహరణంబు సలిపినావు
సత్ప్రభాహరణంబు సలుపుటయేకాదు చెలియలింటికిఁ గీడుఁ దలఁచినావు
చెలియలింటికిఁ గీడుదలఁచుటయేకాదు కుముదాత్రేయాకృతి నమరినావు
కుముదాత్రేయాకృతి నమరుటయేకాదు రాకాసివై మిన్ను ప్రాఁకినావు



ఘాతరాజవు నిమెచ్చ నెవరితరము । విరహిణీ మారణోద్యోగ విభవమెల్ల
నీకె చేకూడె మాదృశలోక పూర్వ । జన్మదుష్కర్మ వశమున శర్వరీశ. ౯౦

చ. కినుకశశాంకమౌళి యనికిం జనుదెంచిననాఁడు పాండునం
దనుఁ డల గాండివంబుగొని తాఁకిన నవ్విభు మస్తకాగ్రమం
టినహతి నీకుఁదప్పుట గణింపఁగ నో హరిణాంక మత్కృతా
భినవమహోఘశక్తియని పేర్కొనరాదె ధరాతలంబునన్. ౯౧

సీ. విషరాశిలో నుద్భవించుటయుండఁగా నొకవేళ వక్రతనుండరాదె
సత్సమూహంబు తేజముగొంటదలఁచిన దోషాకరుండని తోఁచరాదె
హాలాహలంబుతో నైపుట్టినప్పుడె ముక్కంటి యౌదల నెక్కరాదె
తమ్ములసిరిఁ జూడఁ దలఁచనిపనివిని యవనిలోనఁ గళంకియనఁగరాదె
యిన్నిగుణములు నెన్నికై యున్నయపుడె । పాంథజనములఁ గడు భంగపఱచరాదె
నీవశక్తుండవనమయ్యె నీరజారి । మమ్ముదయచేసి వేఁడిమి మానియున్న. ౯౨

గీ. కువలయము మెచ్చు రాజనుకొని నుతింతు । నవని సర్వజ్ఞమౌళివీవని భజింతు
నెలమి సన్మార్గరతుఁడని యెంతునిన్ను । నింత వేఁడిమి చూపకు మిఁక శశాంక. ౯౩

చ. చక్కొరవింటిరాజు సుమచాపముగైకొని మేరుధన్విపై
నెక్కటివై జయించితిల నెవ్వరు నీసము లెంచి చూడ నీ
చక్కని పాదముల్దలఁచి సాగిలిమాటికి మానసంబున
మ్రొక్కెద నెక్కుడించు శరముల్దొనఁజేర్చి నవేక్షుచాపమున్. ౯౪

ఉ. రాహుముఖంబునం బ్రతికె రా జల కైరవబాంధవుండు ఘో
రాహవవృత్తి శూలినయనాగ్ని హతింబడి మైఁడిజాడను
త్సాహముతోఁ జనించి కొనసాగితి నీవును మేనమామతో
నూహయొనర్పఁగా సముఁడవో సుమకార్ముక మీనకేతనా. ౯౫

మ. కలకుంఠాపులు నూఱునేమిటికి రంగద్భృంగ మౌర్వీధ్వను
ల్లొరయ న్విగ్గాననేల నీవు జగతిన్మూర్ధాభిషిక్తుండవై
పఱవ న్నీశుకశారికాది బలశుంభద్భల్లకే పాంథులం
దఱుఁ బ్రాణంబులొసంగుచుండఁ గనియున్ దర్పంబు రెట్టింపఁగన్. ౯౬

క. పవనా మలయాచలనిజ । భవనా నన్నిపుడు సత్కృపాబుద్ధిం గా
వవనా యబలాళులపై । నవనాహితబుద్ధినగు ధుతాగ్రోపవనా. ౯౭

ఉ. బాలికల న్వియోగినులఁ బాపమెఱుంగక నొంచియంతనా
ఖిలపటీర శైలఫణి భీషణదంష్ట్రలకామిషంబవై

కాలునిప్రోలుచొచ్చి తిరుగంజనుదెంచియు వమ్ముసేతురా
బాలసమీర మీఱక కృపాకలితాత్మతఁ గావు మేటికిన్. ౯౮.

ఉ. జాతికిదూరమై మధుపజాతిఁ దగుల్కొని దర్పకాశ్రయ
ఖ్యాతివహించి కాంచనముగాంచితి వింతియకా వసంత నీ
రీతి పలాశమండలికిఁ బ్రేమకరంబగుటొప్పు సద్విజ
వ్రాతము లుత్సహించి నినుఁ బ్రార్థనసేయుట చిత్ర మెన్నఁగన్. ౯౯.

ఉ. చాలసుజాతిఁ బ్రోచితొ కుజన్మతగాంచి చలించకుండు చం
డాలుల నప్పలాశ నివహంబుల డీలుపడంగఁజేసితో
యేల వసంత మాధవసమీహితనామము కౌశికాఖ్యచే
వేలుపుఱేనిఁ బోలఁగలవే జగతీస్థలి ఘూకజాతముల్. ౧౦౦.

వ. అని. ౧౦౧.

క. ఈగతిఁ బలుకుచు నయ్యేల । నాగ మహామోహజలధినడుమం దిరుగన్
వేగము నావ లభించిన । లాగున నొక శారికాలలామంబటకున్. ౧౦౨.

క. చనుదెంచి తాఁ దమాలిక । నని తనపేరుగ్గడించి యబలా యీరీ
తిని జింతయేల నన్నుం । బనిచిన నీప్రియునిఁ దెత్తుఁ బ్రమదంబలరన్. ౧౦౩.

చ. అనవిని తత్సఖీజనములందఱు సంతసమందిచూడ న
వ్వనిత తమాలికంబాగడి వాంఛితము ల్సమకూర్చి పోయిర
మ్మని యొకలేఖవ్రాసి తనయగ్రమునందిడ వేడ్కతోడఁ గై
కొని ననుఁగూడవచ్చె నిదిగోనని కీరము శారికామణిన్. ౧౦౪.

క. నమ్మించెను దానన్నక । తమ్మిదియన నాక్షణంబ తద్భూరుహమూ
లమ్ముననున్న నృపాలుఁడు । సమ్మదమునఁ బొదలెఁ గార్యసాఫల్యేచ్ఛన్.

వ. అప్పుడు. ౧౦౫.

ఉ. మానవభర్తపాలికిఁ దమాలికవచ్చి నమస్కరించి య
మ్మానినియున్నజాడఁ బలుమాఱును దెల్లముగాఁగఁ బల్కికై
కోనగునంచుఁ బత్రిక నకుంఠితభక్తి నొసంగిన న్మహీ
జానివినంగఁ దత్సఖుఁడు సంస్కృతవైఖరిఁ దెల్పెనీగతిన్. ౧౦౬.

ఆర్యావృత్తము.

"ప్రత్యక్షదృష్టభావా ప్యస్థిరహృదయా కామినీభవతి
స్వప్నానుభూతభావా దృఢయతినప్రత్యయం యువతిః" ౧౦౭.

వ. ఇట్లు చదివిన. ౧౦౮.



క. ఆర్యోదితమగు తత్తా । త్పర్యార్థముఁ దెలిసిరాజు తద్దయుఁ బ్రమదా
శ్చర్యములతోడమనసున । ధైర్యము రెట్టింప సుకృతితముఁడై యలరెన్. ౧౦౯.

మ. జితకల్పద్రుమ దాన దానవరిపు శ్రీపాదపద్మాంత రాం
చిత చేతోలసమాన మానవపతిశ్రేణీనితాంతాదరా
శ్రిత సౌఖ్యాసనయాన యానకరిణీ శ్రీమల్లతాంగీ మనో
రతిరాజన్యసమాన మానజిత కౌరవ్యక్షమాధీశ్వరా. ౧౧౦.

క. సద్వర్ణనీయ ఘనసం । విద్విశ్రుత చరిత నిఖిల విద్వజ్జనతా
హృద్వాంఛిత దాయకభూ । భృద్వరగురుధైర్య జగదభిస్తుత శౌర్యా. ౧౧౧.

తరళ. సరససత్కవిరాజపోషణ సాధుసూనృతభాషణా
నిరుపమానదయా విభాసుర నిత్యపోషిత భూసురా
పరచమూతిమిరప్రభాకర భవ్యనవ్య శుభాకరా
సరసిజాతముఖీ మనోభవ సారనాయక వైభవా. ౧౧౨.

గద్య. ఇది శ్రీవక్కలంక చంద్రశేఖర మహాకవిపౌత్ర భాస్కరసుకవిపుత్ర
విద్వజ్జన విధేయ వీరభద్రనామధేయ విరచితంబైన వాసవదత్తా
పరిణయంబను మహాప్రబంధంబునందుఁ
దృతీయాశ్వాసము.

---

# చతుర్థాశ్వాసము.

క. శ్రీకర బుధవిధు శుభవిభ । వాకర కరవాల భైరవాఖ్యాపర హృ
ద్భీకర ప్రతాపవిజిత ది । వాకర గుణలోల మాధవక్షితిపాలా. ౧.

వ. అవధరింపు మనంతర కథాప్రసంగంబు. ౨.

క. బాల తెలుంగంతయును ద । మాలిక వివరించి యో తమావర రార
మ్మాలస్యముదగదు వృధా । కాలక్షేపమున కేమికారణమనుచున్. ౩.

చ. మదకలవాగ్విలాసగరిమంబు నిజశ్రుతిమధ్యసీమకున్
ముద మొనగూర్పఁగాఁ బలికి మ్రొక్కుచు శారిక ప్రేమఁ జేరిన
న్సదయమనస్కుఁడై ధరణిజాని తమాలిక పక్షజాతము
ల్గదియఁగఁ బట్టి దువ్వి కడఁకం దన యక్కునఁ జేర్చె వేడుకన్. ౪.

క. శౌరికటాక్షముగలి నో । శారిక నీరాకమాకు సమకూర్చెఁ గదా
శౌరికలెల్లను బద మీ । యూరికనుచుఁ దత్సమీహితోద్యోగుండై. ౫.

వ. అట్లమ్మహీపాలుండు తమాలికాసహాయుండై మకరందుండునుం దానునుం గొంత దవ్వరిగి చంద్రికా మధుపానమత్త చకోరమత్తకాశినీసంతోషితాగమనంబును మదనకేళీపరవశ చోళీ చూళీభాగఘటిత వికచవిచికిల సౌరభసంపాదన చాతురీ ధురీణంబును నిశాశశాంకముఖీ నిశ్వాసనిభంబును నగు మలయానిలం బధ్వశ్రమం బపనయింపఁ గుసుమపుంజంబుఁ జొచ్చి ముందట సతతావగాహన చతురవనితా కుచకుంభగళిత మృగమదకర్పూరవాసనావాసిత నీరంబులును దటఘటితస్ఫుట స్ఫటికశిలాసోపానతల నిద్రాయమాణ దుర్జ్ఞేయరూప శ్వేత పారావత రూపంబులును ఘనసారతీర భాసురపులినతల నినాదానుమేయమాన రాజహంస సమూహంబులును సుందరేందీవర బృందమాధ్వీక నిష్యందసేవా పరిభ్రమద్భ్రమరవిభ్రమాదభ్ర శోభాకరంబులును నగు పద్మాకరంబులు దాఁటి యనిల సముచ్చలిత వ్యోమ భూమీరుహసితలతాంత మంజరీమంజులపతాకానికర మనోహరంబులును ననవరత ఘుమఘుమాయమాన కృష్ణాగరుధూపధూమాళిక జలధర పటలీసముద్భూత మురజగంభీరనినాద గర్జారవాహూతకృతకావలాగత భుజగభుజ్నివహంబులును నగు ప్రాసాదంబులునుం గడచి తదనంతరంబ. ౬.

క. భవనందనతుల్యుఁడునై । భవజిత సురవిభుఁడు పద్మభవనిభసుప్రా
భవుఁడు నృపాలుఁడు తత్ప్రియ । భవనముఁ గాంచెను సుఖానుభవ మలరారన్.



సీ. తరళికేతరళయ తతధూపధూమ సంఘాతముద్యద్గవాక్షస్థలేషు
సహకారమంజరి సహకారమంజరీ మానయత్యజధియం హల్లకేషు
మకరికే మకరికాం ప్రకటయ ప్రియసఖీవక్షోజకుట్మలద్వయతటేషు
కేతకి కేతకీజాతమాకల్పయ మల్లికాలంకృత మంటపేషు
కుంతలే కుంతలే స్రజంకింతనోషి
మేఖలే మేఖలే తవమిత్ర తాస్తి
యనుచుఁ జతురత భాషించు వనజముఖుల
పలుకులాలించి మదిఁ బొంగి పార్థివుండు. ౮.

మ. కలలోఁ జూచిననాఁటి సోయగము సాక్షాత్కారమై యుండఁగా
నలివేణిం గలకంఠిఁ బద్మకరఁ గల్యాణిం బ్రవాళాధరన్
దళదిందీవరలోచన న్నవలతాతన్విన్ శశాంకానన
న్గలికిం వాసవదత్త నంచుఁ గనియెన్ క్ష్మావల్లభుం డంతటన్. ౯.

క. వాసవదత్తయు మును దాఁ । జేసిన పుణ్యములఫలము చేకూడెఁ గదా
యీసమయంబున నని కన । కాసనమున నృపతినునిచి యానందమునన్. ౧౦.

క. శ్రీలలిత భాషణములఁ ద । మాలికఁ గొనియాడి సబహుమానంబుగఁ దా
నాలింగనం బొనర్చి మ । హాలసవేషమున నృపతియండ వసించెన్. ౧౧.

మణిగణనికరము.

ముసిముసినగవులు మురిపము దెలుపం । గుసుమశరుఁడు తన రసికత నెఱపన్
బిసరుహముఖి మదిఁ బెనఁగొను తమి సి । గ్గసఁగ విభునిదెస నిటునటు మలఁగెన్.

ఉ. కాంచనమంచ మంచితముగా నపు డిద్దఱుఁ గూరుచున్నచోఁ
బంచశిలీముఖ ప్రదరపాటిత మానసవృత్తిఁ జెంద నే
త్రాంచల చంచలప్రతిభ లవ్వలనివ్వల నివ్వటిల్లఁగాఁ
గాంచుచు నుండ్డారు ప్రమదగౌరవ మొప్పఁగనుండి రయ్యెడన్. ౧౩.

గీ. సరవి నన్యోన్య మోహాతిశయము కతన । నవమనోభవదశఁ జెంద నలినముఖులు
వారినప్పుడు శిశిరోపచార విధులఁ । దెలుపుచుండంగ నచటికి వెలఁదియొకతె.

క. చనుదెంచి యేఁ గళావతి । నని తను నెఱిఁగించి యొకరహస్యము రాజా
వినుము వచించెదఁ గడఁకన్ । ఘనమతితోఁ జిత్తగించఁ గాఁదగు నెలమిన్.

మ. కరుణాసాగర రాజవంశతిలకా కందర్పకేతుక్షమా
వర నీకై వెతఁ బొందె నీచెలియ నే వర్ణింపఁగా నోప నీ

శ్వర కారుణ్యవిశేషయోగమున యుష్మద్దర్శనానందమీ
తరుణీరత్నముపొందె సర్వశుభముల్ దైవారఁగానియ్యెడన్. ౧౪.

క. సమయముగాదిప్పుడుకథ । లమితములెఱిఁగింప నున్నవయ్యా మా భా
గ్యముకతన మీసమాగమ । మమరెం గాకున్న శక్యమా చెలిఁ దెలుపన్. ౧౫.

సీ. చిత్తగింపుము రాజ శృంగారశేఖరక్షితివర్యుఁ డొకపని మతిఁదలంచె
ననఘ పార్థివ విద్యాధర ప్రభుతనూజాతుఁడై తగు పుష్పకేతునకును
దనముద్దుపట్టి నిత్తరుణిఁ బెండ్లియొనర్తు నిక్కమెల్లియటంచు నిశ్చయించె
నేనుగార్యాలోచనానూన మతిఁగాన నెఱిఁగివచ్చితిమీకు నెఱుకపఱప
ననినవిని రాజు భీతభీతాత్ముఁడగుచు
తరుణితో యోగ్యకార్యచింతనమొనర్చి
వార్తలన్నియు నెఱుఁగఁగావలయుననుచు
సఖునిఁ బురినుండ నియమించి సరభసమున. ౧౬.

సీ. సతతమానసగతిస్తుత్యవైభవముగాంచెఁ బ్రకటింప రాజమరాళమేమొ
దేవమణిప్రభాదీపితంబైయొప్పెఁ దర్శింప నభ్రమాతంగమేమొ
జవసమాహృత తీవ్రపవనమైయలరారె దర్వీకర కులావతంసమేమొ
తేజోనిధిత్వ సంస్థితిఁబ్రకాశముగాంచె డంబైనతీవ్రాంశు బింబమేమొ
యనఁగఁదనరు మనోజవంబను తురంగ
మంబుపైనెక్కి మగువతో మనుజవిభుఁడు
తత్పురంబున నుండుట తగదటంచు
విక్రమక్రమశక్తిని వెడలెనపుడు. ౧౭.

శా. ఈరీతిం బురినిర్గమించి వసుధాధీశుండు గాంచెన్మనో
దారక్ష్మారుహ జాలమాలలతికాంత శ్రేణీసంచారవ
న్నీరేజాతముఖీవిధూత మధుపోన్మీల త్ప్రసూనావళీ
సౌరభ్యస్ఫుట మందమారుత మనోజ్ఞంబైన వింధ్యాటవిన్. ౧౮.

క. ఘనమై తరుశాఖావృత । ఘనమై వరఫలనికాయకల్పిత మునిజీ
వనమై పుణ్యనదీపా ।వనమై నుతిగాంచు వింధ్యవన మయ్యెడలన్. ౧౯.

సీ. చండప్రతాపవేదండ శుండాదండఖండిత శ్రీఖండ మండలంబు
వల్లీగృహాంతరోద్యల్లతాంగీ సహోల్లాస న్నతభిల్ల పల్లవంబు
రేవాతరంగిణీ సేవాగతానేక దేవాంగనానేక దీపితంబు
చంచద్గజగ్రహోత్కుంచిత గ్రీవాగ్ర పంచానన ప్రభోదంచితంబు



చటులబల పటుతరసముద్భటకిటీంద్ర । కుటిలదంష్ట్రా విదారిత ఘోణలలామ
శశురురుగ్రాసలోహిత సిక్తఘనవ్ర । కాననంబైన యవ్వింధ్యకాననంబు. ౨౦.

వ. మఱియును సురవరాస్థానంబునుంబోలెఁ గౌశికానందకరంబై సత్పురుష సేవ యుంబోలె నగణ్యశ్రీఫలంబై భారతసమరంబునుంబోలె విజృంభితార్జునంబై సంవర్త సమయంబునుంబోలె ననేకార్కప్రకాశదీపితంబై సత్సంపదయుంబోలె వికసితాశోకపున్నాగంబై శశుచిలాసంబునుంబోలెఁ బ్రకటితధాత్రీకృత విభవంబై లంకానగరంబునుంబోలె బహుపలాశాలంకృతంబై సుగ్రీవసేనాని వేశంబునుంబోలెఁ బనసనలభాసురంబై సువాసినియుంబోలె సిందూరతిలకాలం కృతంబై కురుసేనయుంబోలె సులూకద్రోణ శకునిసనాథ ధార్తరాష్ట్రానీకంబై యనింద్యజాతి కలితంబయ్యు విరుద్ధవంశంబై ఘనపథ్యాభినుతంబయ్యుఁ బ్రభూత గుల్మంబై షట్పదాకులంబయ్యు ద్విపదావృతంబై ద్విజకుల విరాజితంబయ్యు నకులీనసమాకులంబయి యొప్పు నవ్విపినంబుఁజొచ్చి యప్పుడమితేఁ డతిదూరం బరిగి కుసుమకిసలయవిసరసుమనోహరంబగు నొక్కతరువుక్రింద హయావతరణం బొనరించి తరుణియుందాను లతానికుంజంబునఁ గిసలయశయ్యామేను చేర్చి యధ్వ బాయాసభరభరితుండై నిద్రింపుచునుండ నప్పటిరేయిగడచు సమయంబున.

గీ. కాలకైవర్తకుండంత గగనసరసిఁ । జెలఁగి చీఁకటివలవేయఁ జిక్కినట్టి
శఫరశాబములనఁ దెల్విసన్నగించి । యుడుములుచూడఁ గనుపట్టె నాక్షణంబ.

గీ. కలికిరేచాన ప్రత్యూషకాలమనెడు
ముసలము వహించి వివరాంక బిసరుహారి
మండలోలూఖలమున నామనిగదంచ
నొలుకు తండులములఁ బోలియుండె నుడుకులు. ౨౩.

క. కమలిని పూజ యొనర్పఁగ । సమకట్టి దివాకరునకు సద్భక్తిని ధూ
పములొసఁగె ననఁగఁదనరెం । గమలములను దిరుగు తేఁటిగము లయ్యెడలన్.

ఉ. వాసరవానరుండు సురవర్త్మము పేరిటి భూరుహంబుపై
డాసి ధరాపతత్ఫల విడంబనగాంచు శశాంకుమీఁదఁ జే
వేసెననంచు దిక్కులను విశ్రుతశాఖలుపట్టి యూఁచుచున్
గోసినపువ్వులో యనఁగఁ గుందితలీలఁదనర్చెఁ దారకల్. ౨౫.

గీ. భవ్యశతపత్ర పుస్తక పాణులగుచు । సరసులొంగి మాధుకరవృత్తి సంఘటింపఁ
గాలయోగింద్రుఁ డరుణాంశుకంబుఁ బూని।వచ్చెననఁ దూరు పెఱ్ఱని వన్నెనలరె.

సీ. ఉదయభూధర తటాభ్యుదయ విభ్రాజిత పద్మరాగప్రభా పటలియనఁగఁ
బ్రాజ్యమహీధరనితంబ ప్రస్రవద్ధాతుధారా ఝరద్యుతిస్తబక మనఁగఁ
బ్రాచీన పర్వతారణ్య కుంజాంతరవికసజ్జపావిభా విసరమనఁగఁ
బూర్వక్ష్మాభృత్ప్రభూతసింహకిశోర దళితేభగళదసృగ్ధామమనఁగ
నైంద్ర దిక్కుంభికుంభ జృంభాతిరేక । లలితసిందూరరేఖా విలాసమనఁగ
నరుణ తరుణాంశు కందళస్ఫురణఁదనరి । తూర్పుదిక్కునఁ గెంజాయదోఁచె నంత.

సీ. ప్రాజ్యనగధాతు ధారాయుతాఖండలదంతినిష్ఠుర పాదతలమనంగఁ
బౌరుహూతీనవాంభోరుహాక్షీ ఫాలలలిత కుంకుమబిందుతిలక మనఁగ
గగననామక పురాగ్రద్వార సంస్థితపటురత్న పూర్ణకుంభంబనంగఁ
బ్రాగ్దిశాసుందరీ ప్రకటకాంచీ లతాసంగతదీనారచక్రమనఁగఁ
గమలములువిక్కఁ జక్రవాకములు చొక్కఁ
దారకలుజాఱ భృంగసంతతులు గేరఁ
బూర్వగిరిఁ జాల మందారపుష్పవిభ్ర
మంబుతోఁ దరుణారుణబింబ మలరె. ౨౯.

సీ. పద్మినీవ్రతపరిపాక లబ్ధఫలంబు లోకత్రయీదివ్యలోచనంబు
పద్మజాండకటాహ భవనప్రదీపంబు కుముదినీభోగ సంకోచకరుఁడు
కాంతి విభ్రాజితాకాశ మాణిక్యంబు చక్రద్వయీమనస్తాప హరుఁడు
ధ్వాంత సంతతి పర్వతచ్ఛిదా వజ్రంబు భవభయాపహ లోకబాంధవుండు
వేదమయుఁడు రక్షాహతవీరలోక । దివిజమార్గంబు గ్రహకులాధీశ్వరుండు
కర్మసాక్షి త్రిమూర్తి జగన్మయుండు । భానుమంతుండు తూర్పునఁ గానవయ్యె.

గీ. గోపతిత్వము గాంచె శక్రుండొ తార
కాకృతియడంచి మించె షడాననుండొ
యనుగతచ్ఛాయుఁడయ్యె నిత్యాధ్వగుండొ
యనఁగనొప్పారెఁ బంకేరుహాప్తుఁడతఁడు. ౩౦.

సీ. పౌరుహూతీ కుచాభ్యంతరాంతరలిప్త కుంకుమద్యుతుల నలంకరించి
దండధరాంగనా ధమ్మిల్లఘటిత చాంపేయదామప్రభ శ్రేమనురసి
కంధివల్లభ శాలికాకరస్థలలోల లీలాబ్జరోచుల గేలిచేసి
ధనదకాంతా కటీతటనట న్మాంజిష్ఠవసన కాంతులకు మేల్వన్నెయొసఁగి
తప్తహాటక ధగధగ ద్ధగితరుచుల । జలధరచ్ఛేదముల నింద్రచాపశకల
విభ్రమంబు ఘటింపుచు విన్నుప్రాఁకె । యలరె నవ్వేళ బాలారుణాతపములు.



శా. భూవిఖ్యాత ఘనాతపావృతి సముత్ఫుల్లాకృతిం బర్వఁగా
నావేళన్ ధరణీతలేశ్వరుఁడు మార్గాయాసఖిన్నాత్ముఁడై
తావల్లరిమ్ము లతాంతశయ్యపయి నిద్రాముద్రఁ జాలించి యొం
టే వేగంబున లేచి యందు నృపపుత్రీరత్నముం గన్నకన్. ౩౨.

క. కాంతామణిఁ గానక కుం । జాంతరమున వెదకి దిక్కులరయుచు ధరణీ
కాంతుఁడు తోఁచక యచ్చటి । కాంతారంబెల్ల నరసి కడు వివశుండై. ౩౩.

వ. ఇట్లు చింతింపం దొడంగె. ౩౪.

ఉ. ఎందు వసించితే శశిముఖీ నను వంచనసేయఁ జెల్లునా
మందగతిం జెలంగి కుసుమంబులు గోయఁగ డాయనేగితో
కెందలిరాకు జొంపముల క్రిందున డాఁగితొ వేగ రాఁగదే
మందమరాళయాన యని మాటికి మాటికిఁ బిల్చు నచ్చటన్. ౩౫.

క. నీకై రాజ్యము వదలి య । నేకాయాసములు పడితి నీవెఱుఁగవె నేఁ
డీకరణి నన్ను విడుచుట । యోకలికీ నీకుఁ జూడ నుచితమె చెపుమా. ౩౬.

ఉ. హా సఖి నిన్నుఁ బాసి క్షణమైన భరింపఁగనోప నక్కటా
దోసపుదైవ మీగతిని మారముఁ జేసె నిఁకేమొనర్తుఁ జే
రాసలఁ జెందిచెంది ఫలమందెదనంచుఁ దలంచితి న్మదా
వాసముఁ జేరకున్కి తగవా మగువా నగువారికైవడిన్. ౩౭.

మ. మును దాఁ జేసిన దుష్కృతంబు ఫలమో ముందేను రారాఁగఁ బ్రో
వను గల్పించిన దుర్నిమిత్తముల కీ వంకన్ఫలం బయ్యెనో
వనితా నిన్నెడఁబాసియుండుమని దైవంబిట్లు గావించె హా
యనుచు న్రాజకుమారశేఖరుఁడు చింతాక్రాంతుఁడయ్యె న్మదిన్. ౩౮.

క. గురుశుశ్రూష యొనర్చిన । శరణాగతవితతిఁ బ్రోవఁ జాలిన విద్వ
త్పరిచర్యలు చేసిన మ । స్కరమగు విధివ్రాఁతఁ గడవఁగా వశమగునే. ౩౯.

సీ. మునిపత్నిఁ గామించి మోసపోయెను వజ్రి గురుదారకై కంటె సరసిజారి
కుహిఁ బురూరవుఁడు బ్రాహ్మణధనాశ నశించె నూసరవిల్లియై యుండె నృగుఁడు
దశరథుం డరిగెను దయిణిమాటలు విని నలరాజు గలిచేతఁ జులకనయ్యె
ఘనపురోహితకన్యఁ గనిచలించె యయాతి శంతనుం డధిక వ్యసనతఁ గుందెఁ
గాన గణుతింప మానుషలోకమునయందు । నిష్కళంకుండు లేఁడని నిశ్చయించి
తనుపరిత్యాగ మొనరింపఁ దలఁచియపుడు । ధారుణీపతి గహనమధ్యంబు వెడలె.

వ. ఇట్లు వెల్వడి దక్షిణాభిముఖుండై దూరంబరిగి ముందట. ౪౧.

మ. కనియె న్దక్షిణదిక్తటంబునఁ జలత్కల్లోలహల్లీసక
స్వన విభ్రాజిత నీరము న్మకరమత్స్యవ్రాత దుర్వారముఁ
జనతాఘౌఘ విదారము న్వృతమరుత్సంచారముం బుణ్య సా
రనదీమోహనదారముం లవణపారావారము న్వేడుకన్. ౪౨.

క. కనుఁగొని కృతాపరాధుని । ననుఁ బుణ్యునిఁ జేయఁదలఁచినాఁడీ యనఘుం
డని భయభక్తులు గదురఁగ । జనపాలుఁడు వార్ధి నిట్లు సంస్తుతిఁ జేసెన్. ౪౩.

సీ. అహిమకరప్రకాశానందకరదేహుఁ డనుపమసుగుణరత్నాకరుండు
కంకణసూర్మికాలంకారసహితుండు భూవిశ్రుతోన్నత జీవనుండు
వర్ణితశతకోటి వాహినీనాథుండు లావణ్యగాంభీర్య లక్షణుండు
ఘనతర శ్రీజన్మ కారణ స్థానంబు జగదభిస్తుతమహాసత్వశాలి
భూమిభృత్తుల భరియించు భూరికీర్తి । బుధుల కాఁకలిదీర్చిన పుణ్యమూర్తి
దినదినము వృద్ధిగాంచిన ధీవరేణ్యుఁ । డెంచఁదగిన మహామహుం డితఁడె తెలియ.

సీ. ఈతని గాంభీర్య మెట్టిదో కవ్వమై తిరిగిన మందరగిరియెఱుంగు
నీతని యౌదార్యమెట్టిదో యజరామరత్వంబుగను సురప్రతతియెఱుఁగు
నీతని సంపత్తియెట్టిదో సిరిఁగూడి యిల్లఱ్ఱమున్న సర్వేశుఁ డెఱుఁగు
నీతని ప్రాభవం బెట్టిదో వజ్రినిగణనసేయని నగౌఘంబెఱుంగుఁ
గాక యీతని నొరులకశక్యంబె తెలియ । నప్పు డెక్కువ భంగము ల్చెప్పఁ దఱుచు
లోని చిచ్చార్పఁగా నోపలేనివాఁడు । నిక్కమని కొండఱాడినఁ దక్కువగునె.

వ. అని యివ్విధంబున నవ్వననిధింగొనియాడుచుం జనిచని యమ్మనుజవిభుండు కురరఖరనఖముఖ విదారిత పృథుల పృథులోమశకల సమాకులంబును నవికలజల నకులకుళీరసంచార సమంచితంబును నతితరళజలలవలులిత శఫరశిశుకబళన నిభృతబకనికరధవళిత పరిసరంబును ఘనపవనమర్మరిత తరళతరతాళీవనదర్శన చకితజలమానుష మిథునపదతల మృదితబాలశైవాలజాలంబును ధరణీతరుణీ దర్పణనిభంబును వరుణవిహరణమహిత వజ్రకుట్టిమసమంబును నగు విపులపులిన తలంబుపై నధివసించి కించిన్నిమీలితనయనుండై సూక్తసంకల్ప మార్జనాఘమర్షణ దేవర్షితర్పణ పూర్వకంబుగాఁ గృతసముద్రావగాహుండై శరీర పరిత్యాగ బుద్ధిన్ జలంబులలోనికిం జనఁజనఁ గచ్ఛపంబు లనిచ్ఛం బ్రవర్తించుటయు నక్రంబు లవక్రంబులై యుండుటయు క్షుద్రాండంబు లక్షుద్రంబులగుటయు గ్రాహంబు లను గ్రహంబుసేయుటయు వాఃపూరంబు తీరంబుఁ జేర్చుటయుంజూచి విస్మితుండై యుండె నపుడశరీరవాణి యో కందర్పకేతుభూకాంతా నీకాంతారత్నంబగు



వాసవదత్తతో సమాగమం బచిరంబ నీకునయ్యెడు నింక మరణోద్యోగంబుఁ జాలించుమనిన వినివిస్మితస్వాంతుండై మరణవ్యవసాయంబు చాలించి తత్కచ్ఛోపాంతకాంతారంబునం గొంతకాలంబుగడపి వ్యర్థకాలక్షేపంబు తగదని తన తరుణినిం గనుదనుకఁ బుణ్యక్షేత్ర నిరీక్షణంబు గావింతునని నిశ్చయించి కాశికా నగరదిదృక్షాతత్పరుండై సముద్రతీరంబు వెలువడి కాననంబులు గడచి గిరిగహ్వరంబులు దాఁటి వాహినులుత్తరించి పట్టణంబులు పరీక్షించి బహుదూరం బరిగి యంతట. ౪౮.

సీ. నివసించె నేవీట నిజపదాబ్జానతోమాధవుండగు బిందుమాధవుండు
ప్రవహించె నేవీట భవబంధవిచ్ఛేదకరవారిసంగ యాకాశగంగ
దయసేయు నేవీటఁ దారకం బఖిలదేహులకు విశ్వేశ్వరుం డెలమితోడ
సిద్ధించు నేవీట జీవకోటికి శంభుసారూప్యముక్తి నిస్సంశయముగ
నరసియే వీటఁ బ్రతిదినం బన్నపూర్ణ । యతిథుల కమృతదివ్యపాయస మొసంగు
నట్టి కాశీపురంబు ప్రత్యక్షమైనఁ । గాంచి ముదమందె నారాచకలువతేఁడు.

సీ. అభ్రంకషాదభ్ర విభ్రమస్ఫూర్జిత గోపురోన్నత రత్నగోపురములు
మందాకినీతీర బృందావనప్రభావానూన పరమహంసాశ్రమములు
దివిజసంఘాత ప్రతిష్ఠిత శివలింగసంగతప్రాసాద సముదయములు
చంచల చంచరీకాంచిత ప్రసవాభిరామ నానావిధారామములును
గలిగి చెలువొందు నల కాశికాపురంబుఁ । జేరఁజని నృపతి యచటి వారివలనఁ
దత్ప్రభావంబుఁ దెలిసి సంతసముమీఱ । జాహ్నవినిగాంచి యిట్లని సన్నుతించె.

స్రగ్ధర. నీరస్మేరాబ్జభృంగే నిరుపమకరుణో న్నిద్రభద్రాంతరంగే
తీరప్రోద్యత్కుటుంగే దివిజమునికృతోదీర్ణవాక్యప్రసంగే
ధీరవ్రాతానుషంగే ధృతపవనముఖోద్గీర్ణ రంగత్తరంగే
పారావారాంగసంగే భవభయచకితం పాహిగంగే శుభాంగే. ౪౯.

క. అని గంగను గొనియాడుచు । జననాథాగ్రేసరుండు శాస్త్రోదిత రీ
తిని గ్రుంకులిడి ముదంబున । దినకృత్యముదీర్చి తా నతిస్థిరలీలన్. ౫౦.

క. పౌరులనుగూడి సంతోషభరితుఁ డగుచు । నాదికేశవమూర్తి దేవాలయంబుఁ
జేరఁ జనుదెంచి గుడిఁజొచ్చి చేతులెత్తి । హరిఁ బరంజ్యోతి నిట్లని యభినుతించె.

మ. జయ గోవింద రమామనోహర శరత్సంపూర్ణచంద్రాననా
జయ వైకుంఠనికేతనా నరసఖా చక్రీ జగన్నాయకా

జయ నీరేరుహపత్రలోచన నిరీశా దైత్యలోకాంతకా
జయ శక్రాది సురార్చితాంఘ్రియుగళా శౌరీ మురారీ హరీ. ౫౨.

సీ. జయ దీనమందార సకలలోకాధార భక్తచిత్తవిహార భయవిదూర
జయ ఖగేంద్రతురంగ శయనీకృతభుజంగ కరుణాలసదపాంగ ఖలవిభంగ
జయ మునిస్తుతిపాత్ర జలదసన్నిభగాత్ర సజ్జనవనచైత్ర శంభుమిత్ర
జయ సురస్తుతనామ సమదాసురవిరామ శతకోటిరవిధామ సుతనుకామ
జయ రమాపీనకుచయుగస్థగిత గంధ। సారభాంకిత సద్వక్ష సారసాక్ష
జయ మురాసుర శిక్షణ చణకరాగ్ర। శోభితరథాంగ గోపకన్యాభుజంగ. ౫౩.

శా. శ్రీకాంతాయ నమో నమో బుధగణజ్యేష్ఠాయ పాదానత
శ్రీకంఠాయ నమో నమో మునిమనస్సేవ్యాయ నీలాంబుదా
భాకారాయ నమో నమో దనుజసంహారాయ మాయాంబ
ర్థాకల్పాయ నమో నమోయనుచు నిన్నర్చించెదన్ శ్రీహరీ. ౫౪.

ఉ. మ్రొక్కెద సర్వదేవమునిముఖ్యనమస్కృతపాదపంకజా
మ్రొక్కెద నీలమేఘనిభమోహనదేహ విభావిరాజితా
మ్రొక్కెద దుష్టదానవసమూహవిదారణ మూలకారణా
మ్రొక్కెద నన్నుఁగావుము సరోరుహలోచన శ్రీశ కేశవా. ౫౫.

మ. అని యద్వైతసార్వభౌముని సపర్యాభక్తిఁ గావించుచు
న్దనజన్మంబు పవిత్రమయ్యెనని మోదంబంది నర్తించుచు
న్జననాథాగ్రణి రాజమార్గమున సంచారంబు గావించు స
జ్జనులంగూడి సమస్తదైవత దిదృక్షాదక్షుఁడై యంతటన్. ౫౬.

శ్రీకాశికాపురీ సింహాసనాసీను మునివంద్యు విశ్వనాథుని భజించి
యక్షరీకచభ్రమద్భ్రమరీహితపదాబ్జ నన్నపూర్ణను విశాలాక్షిఁ గొలిచి
యాఖువాహనుని లోకారాధ్యు ఘను డుంఠివిఘ్నేశదేవుని వినుతిఁ జేసి
శాతమన్యవ మణిస్తంభ గంభీరబాహుని భైరవస్వామిఁ గని నతించి
దండపాణిని బాగడి వందనమొనర్చి। త్రోవలోనున్న లింగమూర్తులకు మ్రొక్కి
విపులకైనట్టి ముక్తిమంటపముఁ గాంచి। ముని మఠంబులఁజూచె నజ్జనవిభుండు.

వ. అంత. ౫౭.

శా. నీలాంభోధరము ల్నభస్థలిని రాణించె న్మయూరాళి పిం
ఛాలంకారత నాడెఁ జాతకము లత్యానందముంబొందె వా
త్యాలోలాకృతి సన్నగించెఁ గుసుమప్రాలంబరోలంబ వా
చాలంబై కనుపట్టె జాతితతి వర్షాకాలమయ్యెన్ ధరన్. ౫౮.

సీ. ఆకాశపద్మాకరాభ్యంతరస్థితానంగలాక్షా విచిత్రనాకయనఁగ
నంబుదమార్గ హర్మ్యద్వారసంబద్ధ మణిమయతోరణ మాలికయన
గగనలక్ష్మీ కటీఘటితంపుత్రాంతుక కాంతిసంగత హేమకాంచియనఁగ
ద్యుసరోరుహాక్షీ పయోధరస్థ నిదాఘకాంతసంతత సఖాక్రాంతి యనఁగ
నింద్రచాపంబు పడమట నేర్పుఁజూపె। నుత్తరంబునఁ జంచలాభ్యుదయమయ్యెఁ
దూరుపునుండి చనుదెంచె మారుతములు। దక్షిణంబున మేఘసంతతులు దనరె.

మ. శరధి న్నీరము గ్రోలుచో నతితృషన్ శంఖంబులుం గ్రోలి వా
ర్ధరసంఘాతము వానకాలమునఁ దత్తచ్ఛంఖసంఘంబు దు
గ్ధరమైన న్వమనంబొనర్చనన నభ్రశ్రేణికిం జేరువం
గర మొప్పంజరియించె నయ్యెడ బలాక ల్గర్భముల్దాల్చుచున్. ౬౦.

క. ఘనసమయంబని యెడుకాం। చన కారకుఁడప్పుడు నీలజలదకషణం
గనుఁగొని వారవట్టిన కాం। చనరేఖయనంగఁ దనరి చంచలపొడమెన్. ౬౧.

మ. ఘనకాలప్రియ సంగమస్ఫుటితదిక్కాంతాకుచాహారమో
హనముక్తామణులోయనంగఁ జటులాభ్రానీక భీకృద్విఘ
ట్టన సంచూర్ణిత తారలోయనఁగఁ జూడ న్వేసనై యభ్రవీ
థిని వర్షోపలముల్దొలంగెను ధరిత్రీభాగముం గప్పుచున్. ౬౩.

క. పరహితవృత్తిం దిరిగెడు। విరహుల గుండియలు చెండివేయుదుననుచు
స్మరుఁడొనరించిన బంగరు। కరపత్రంబనఁగఁ గైతకచ్ఛదములలరెన్. ౬౪.

గీ. శాద్వలస్థలిఁగననొప్పెఁ జారులీల। నింద్రగోపతనుద్యుతి సాంద్రమగుచుఁ
బుడమిచేడియ తనమేనఁ బూనినట్టి। నీలలోహిత వర్ణాంకచేలమనఁగ. ౬౫.

వ. మఱియు మధురస్వరఫణితియుంబోలె సమృద్ధనిమ్నగానందంబై సాయంసంధ్య యుంబోలె నీలకంఠనటనాచటులంబై మహాతపస్వియుంబోలె రజఃప్రసరాపహరణక్షమంబై తాపసహస్తంబునుంబోలె సజలకరకాలంకృతంబై కల్పాంత సమయంబునుంబోలె దస్మితానేకతరణి విభ్రమంబై రావణ పౌరుషంబునుంబోలె మేఘనాదజనకంబై యొప్పు నప్పటి వర్షాకాలంబవిముక్తక్షేత్రంబున గృహమేధి నికేతనంబులఁగడపి యంత నచ్చోటు వెడలి ధరిత్రీవల్లభుండుల్లసితాంతరంగుండై క్రమక్రమంబున గయాప్రయాగంబులు సేవించి తత్తదుచితకృత్యంబు లొనరించి శ్రీజగన్నాయకసేవాతత్పరుండై కతిపయప్రయాణంబులరిగి ముందట. ౬౬.

శా. పారావార తటాంతరస్ఫుటవటోపాంతాధ్వవిశ్రాంత నా
నారాష్ట్రాగత మర్త్యదర్శిత జగన్నాథ ప్రభావాంచితా
కారక్షోణి సురావళీవినుత ముఖ్యక్షేత్ర మాహాత్మ్య వి
స్తారంబౌ పురుషోత్తమంబుఁ గనియోజ క్ష్మావల్లభుం డంతటన్. ౬౭.

ఉ. ఏపుటభేదనంబు దివిజేంద్ర నమస్కృత మేపురంబు ల
క్ష్మీపతి దారుమూర్తికి నికేతన మేనగరీవరంబు వి
ద్యాపరిపూర్ణ భూసురవితాన పరస్పరబోధనీయ మా
శ్రీపురుషోత్తమంబునకుఁ జేరువఁ జేరి నృపాలుఁ డంతటన్. ౬౮.

మ. క్షితినాథుం డటు కొంతదవ్వరిగి వీక్షించె న్పదాంభోరుహా
నతసంఘాత విముక్తిదాయక జగన్నాథాలయాగ్రస్థిరో
న్నతి వీక్షామతికాంత శాంతజనసంతానావనావక్రమున్
దితిపుత్రాంతక రూపరక్షిత ధరిత్రీచక్రము న్జక్రమున్. ౬౯.

వ. తదనంతరంబ. ౭౦.

సీ. తతధూపధూమ విస్తారితాంభోధర పటలోన్నటధ్వజ పటయుతంబు
హరినీలమరకత కురువిందవిద్రుమ కృతమణిస్తంభ సుశ్రీపదంబు
తప్త హాటక నిర్మిత ద్వారబంధబంధుర వజ్రకీలితారరయుగంబు
నఖిలదిగ్దేశాగతానేక మానవమహిత సింహద్వార మంటపంబు
విశ్వకర్మ తపోబలావిష్కృతంబు
సర్వగీర్వాణ సంఘాత సన్నుతంబు
నగుజగన్నాథదేవు దేవాలయంబు
గాంచి యారాజు కృతనమస్కారణుఁ డగుచు. ౭౧.

మ. వటభూజాతము నీడఁ జేరి విబుధవ్రాతంబుతోఁ గూడి య
చ్చటి తీర్థంబులనోలలాడి యపునర్జన్మాభిలాషావిశం
కటబుద్ధిం జని భక్తిపూర్వముగ మార్కండేయ శంభున్నృపుల్
బటువాక్ప్రౌఢిఁ బ్రస్తుతించి జని సాఫల్యమ్ముగా నంతటన్. ౭౨.

సీ. హరిపాదయుగచింత నాత్యంత నిర్మలస్వాంతులు వేదాంత సారవిదులు
భుజలతామూల విస్ఫుటలక్ష్యమాణ ముద్రిత శంఖచక్ర సుశ్రీసమేతు
లనుపమ తులసీదళాంచిత నళినాక్షమాలికాధారణాలోలమతులు
ద్రావిడగ్రంథ సందర్భవిజ్ఞాన ధీచతురులు సకలశాస్త్ర ప్రవీణు



లఖిలలోకైకసమ్మతు లార్యహితులు । నైన వైష్ణవరాజుల నాశ్రయించి
శ్రీజగన్నాథదేవుని జేరి మ్రొక్కి । పార్థివోత్తముఁ డిట్లని ప్రస్తుతించె. ౭౩.

రగడ. జయజయ పారావారసమీపాంచన్నీలావలకృత నిజమందిర
జయజయ ధీరామరమునిచేత స్సరసీరుహ సంచరదిందిందిర
జయజయ బలభిన్మణినీలాంబుదసన్నిభ శోభాకలిత సువిగ్రహ
జయజయ నిజపదసరసిజసేవా సక్తజనావనవిలసదనుగ్రహ
జయజయ నందయశోదా మందిర శైశవలీలాజన సంసేవిత
జయజయ చక్రగదానందకధర శార్ఙ్గాద్యాయుధ రుచిసంభావిత
జయజయ కరధృత గోవర్ధనధర సంరక్షిత పశు గోపకుమారక
జయజయ జగదాభీలజ్వాలా చటులదవానల భీతినివారక
జయజయ గోపనితంబవతీ కుచసంశ్రిత చేలగ్రహణకుతూహల
జయజయ కాళియఫణిఫణరంగస్థల పటునటనాకృత కోలాహల
జయజయ నీలాలకభృంగావృత జలరుహనిభముఖజిత శశిమండల
జయజయ దర్పణదీప్రకపోలోజ్జ్వలచల కర్ణాంచల మణికుండల
జయజయ సుభ్రూమదన శరాసనసంధీకృత సుమశరనిభలోచన
జయజయ కాంచనకోరక వంచన చంచుసునాసాంచిత భవమోచన
జయజయ గోపీతాపనివారణ సాధుసుధాపూరిత మధురాధర
జయజయ కంఠవిడంబితకాంబవసౌభాగ్య మురాంతక ధృతభూధర
జయజయ కమలాకుచతట కుంకుమచర్చాలంకృత వక్షోరాజిత
జయజయ కలనిక్వణమణికంకణ చారుకరాంబుజ దివిషత్పూజిత
జయజయ మృదుతర నవబిసలతికా సంకాశభుజాస్తంభ విభాసుర
జయజయ దామాంకిత పటురేఖా సందేహదవళిభంగజితాసుర
జయజయ గగనసమానవలగ్నాశ్రయరశనాధృత కింకిణిభూషణ
జయజయ నిశ్చలవిద్యుల్లతికాసమచేల కటీతట మృదుభాషణ
జయజయ దిగ్గజకరగురుశోభాచారూరుద్వయ వినతాఖండల
జయజయ జానూన్నతి నిర్జితకాంచన కాహళ సంహృత రిపుమండల
జయజయ హరమకుటాంచద్గంగాజనికారణ నిజపాదసరోరుహ
జయజయ వైకుంఠాలయభక్తాశ్రయఫలవినమత్కల్ప మహీరుహ
జయజయ దీనత్రాణపరాయణ శాశ్వత పురుషోత్తమ జగదీశ్వర
జయజయ దారోసబల్లసుభద్రాసహితహరే మాంపాహినిరీశ్వర. ౭౪.

చతుర్విధకందము.

సారసదళాక్ష జలదా । కారా నిహతారిజాల ఖగరాజహయా
ధీరాగ్రగణ్య జగదా । ధారా యహిశయన జలధితనయాసహితా. ౭౫.

త్రిశ్రథకందము.

కరివరదా మునివరదా । హరసఖ నగజనక యసురహర గిరిధర సా
గరతనయా ఘనకుచ భూ । ధర వరశయ వనజనయన దరకరయభవా ౭౬.

గీ. పతితపావన పరమేశ పరమపురుష । నతజనాదర సరసఖ నారసింహ
నీలగిరివాస నిరుపమనిర్వికార । జయజగన్నాథ జనగేయ జననరహిత. ౭౭.

లయగ్రాహి.

సారసదళాక్ష సురవారపరిరక్షణ విచార నరకాసుర విదారక త్రిలోకా
ధార యఘసంచయవిదూర పదతాడితమహోరగ భవాంబునిధితారక వ్రజ స్త్రీ
జార మునిమానసవిహార జలదాంచితశరీర గళశోభిమణిహార నవనీతా
హారముఖకాంతిజిత శారదశశాంక యదువీర జలరాశితనయారమణశౌరీ.

శా. నీకద్దైవతచక్రవర్తిని సభన్నిన్నేఁ బ్రశంసింతు నీ
చే విశ్వంబలరారు నీకొఱకు నేఁ జేతున్నమస్కారముల్
నీవల్ల న్భవముల్దొలంగు నెవరున్నీకున్సమల్గారయా
యావిర్భావమునందు లోకములు నీయందేకదా యో హరీ. ౭౯.

క. అకలుషభక్తి జగన్నా । యకునిం బూజించి యీక్రియం బొగడుచు రా
జకుమారుఁ డంతఁ దిరుగుచు । నాకనాఁడు ప్రయాణ సముచితోద్యోగుండై.

గీ. అమృతగుండికలును మనోహరపుటుండ । లిడిననలుఖండ చక్రంబు లిష్టగంధ
భరిత హరిసుప్రసాదము ల్భక్తిమెసఁగి । ముని తరణిఁ గొలుపోయినవనికిఁ జేరి.

క. చని వనిఁగని మునివృత్తిన్ । దినములు గడపుచును దిరిగి తిరిగి యొకశిఖా
వనతాశోకమూలం । బునఁగనఁదగు రాతిబొమ్మ పోలుపుగని మదిన్. ౮౨.

వ. ఇట్లని వితర్కించె. ౮౩.

ఉ. ఈసిగ యీమొగంబుసిరి యీమధురాధర మీకుచద్వయం
బీసునితంబమండలము లీచరణాబ్జము లీస్థిరాంగకం
బీసొగసెల్ల నామదికి నెంచిన నిక్కముగాఁగఁ దోఁచె న
వ్వాసవదత్తరూపవిభవంబు సమంబగునంచు ఖిన్నుఁడై. ౮౪.

ఉ. తప్పకచూచి యాప్రతిమదగ్గఱఁ బోయి నృపాలశేఖరుం
డప్పుడు కేలనంటుకొన నమ్మహనీయ శిలాలలామ తాఁ



గప్పురగంధియై సభయకౌతుకవృత్తిని మ్రొక్కి సిగ్గుతో
నెప్పటియట్లయుండఁ దనయింతిగదాయని సంభ్రమంబునన్. ౮౫.

గీ. అమృతపూరంబుగన్న తృష్ణార్తునట్లు । పెన్నిధానంబుఁ బొడగన్న పేదకరణి
సుందరీమణి నెమ్మోముఁజూచి ధరణి । పాలకుండంత సంతోషభరితుఁడగుచు.

ఉ. ఎచ్చటికేగితే జలరుహేక్షణ యిట్టి శిలాత్వమేటికి
న్వచ్చె నికుంజగేహమున నస్వడనాడఁ గతంబదేమి నా
కచ్చెరువయ్యెడిం దెలుపుమా యన రాజుమొగంబుఁ జూచి తా
నచ్చుగుణాకుఁబోఁడి తెలియందగుఁ దెల్పెదనంచు నిట్లనన్. ౮౬.

సీ. అటునిద్రవోవు నీకన్నముందుగలేచి ఫలసంగ్రహముఁ జేయఁదలఁచి దూర
మరిగితి మీకు నభ్యవహారమొనరింతు నటుబుద్ధిఁబూని యో జనవరేణ్య
కిలకిలార్భటులతోఁ గలయవచ్చుకిరాతసేనలఁగని యందుమానివచ్చి
వేరొక సేనానివేశంబుగని భీతివెనుకకుఁజని పిల్వవెఱచి నన్నుఁ
బట్టితెమ్మని మాయయ్యపంపినట్టి । సేనలో కానలో మిమ్ముఁ జేరునట్టి
యాప్తులోయని యరహింప నాక్షణంబ । యుభయసేనాధిపతులు నాయునికిఁ దెలిసి.

క. ఏకామిష సంప్రాప్తికి । డీకొను గృధ్రంబులట్ల తీవ్రగతులచే
నాకలుషాత్మకు లిద్దఱు । నాకొఱకై ఘోరరణమొనర్చిరి కడఁకన్. ౮౯.

క. వీరభటారభటీదు । ర్వార శరాసార ఘోరవర్షధనుష్టం
కారపబాతిచమూ ఘో । కారముల నజాండమల్లఁ గంపమునొందెన్. ౯౦.

సీ. తతతురంగమ పదోద్ధతిచేత జనియించి క్ష్మాపరాంగంబు మేఘమనఁదనరె
క్ష్మాపరాంగంబు మేఘచ్ఛాయఁదనరారఁ బ్రబలమై బాణవర్షంబుగురిసెఁ
బ్రబలమై బాణవర్షము విరాజిల్లినఁ గలహభుక్ప్రీతకక్ష్యామమొదలెఁ
గలహభుక్ప్రీతకక్ష్యామంబుదీఱిన నమరకాంతా వివాహంబులయ్యె
నట్లయచ్యుత మొదవె యూథాధిపతులు । పరశు పట్టిస ముద్గరప్రాస చక్ర
భల్లకరవాల ఫలక విభ్రాజమాన । హస్తులై డాసి చెలఁగి పోరాడునపుడు. ౯౧.

ఉ. విఱుగురథంబులుం బొడలువెట్టుకబంధములున్ ధరిత్రిఁ బ
ట్లొఱగు గజంబులుం బదములూఁదఁగఁదోఁచక భీతి దిక్కులం
బఱచు హయంబులున్ శరనిపాతతనూద్గత రక్తవర్షము
ల్గొఱలనటించు వీరభటులు న్గలుగ న్రణమొప్పె నయ్యెడన్. ౯౨.

సీ. చలదీల భూధరసంకాశ వేదండకాండము ల్మేఘసంఘములుగాఁగఁ
జిత్రవర్ణాంక విశేషితధ్వజ నూత్నపటకాంతు లింద్రచాపములుగాఁగఁ

బటురణోద్భట వీరభట సింహనాదముల్ రమణీయ గర్జారవములు గాఁగఁ
గరవాలచకచకస్ఫురితనవ్య ప్రభల్ లలిత సౌదామనీ లతలు గాఁగ
వరధనుః ప్రేరణంబునఁ బఱచునట్టి । శరపరంపర ఘోరవర్షంబు గాఁగఁ
బ్రావృడారంభ సంరంభ భరిత మనుచుఁ । బొల్పెనప్పారె నమ్మహాద్భుతరణంబు.

సీ. హరిహరి యనుచు నంబరవీధి నానందభరితుఁడై సురమౌనివరుఁడు దిరిగెఁ
దగుభూషణములు నూతనములై కనుపట్టు భూతనాథుండు సొంపుగ నటించె
నభినవప్రియసంగ మాత్యంతరతిఁ జెంది యప్సరస్స్త్రీనికాయంబు పొదలె
నాఁకలిదీఱ నుయ్యారంబుతో భూతబేతాళగణములు పేర్చియార్చెఁ
గొండలై యున్న యామిషఖండములును
దొరుఁగు రక్తప్రసవంతులుఁ ద్రుళ్ళు తలలుఁ
దెగిన భుజములు ధారుణిఁ దొళ్ళు కాళ్ళుఁ
బ్రోవులై సడ్డ ప్రేవు లద్భుతము సేయ. ౯౪.

వ. అట్లు. ౯౫.

గీ. ఉభయబలములుఁ బోరాడుచుండు నంత । నచటికేతెంచె యోగవిద్యావిశేష
కరతలాంచిత జపమాలికా మనోజ్ఞ । మూర్తియైయొప్పి యొకసిద్ధమునివరుండు.

సీ. పటుజటాజూటంబు భసితత్రిపుండ్రంబు గండలంబిత తామ్రకుండలములు
ధవళయజ్ఞోపవీతంబులుఁ గాంచనయోగపట్టికయు శాతోదరంబు
దీర్ఘకూర్చం బనిందితతనూవిభవంబుఁ బదముల మణిమయపాదుకలును
గరమున జలకుండికయు నాగబెత్తంబు శ్రుతితల ద్విగుణాక్షసూత్రకంబుఁ
గలిగి యడుగిడి యడుగిడి నలిననాభ । చక్రహస్త మురాంతక శ్యామలాంగ
కృష్ణ కేశవ పాహి లక్ష్మీశ యనుచు । నమ్మునీంద్రుండు వనికి డాయంగ నరిగి.

క. చారణ వినుతుం డమ్ముని । మారణకృత్యంబు పొడమ మద్వనిలో నేఁ
డీరణ మొనరించుటకుం । గారణ మీసార సాక్షిగా యని కడఁకన్. ౯౬.

క. అంతేవాసులు గొలువఁగ । నెంతే తనయాశ్రమమున కేగుచు రోషా
త్యంతకషాయిత చలనే । త్రాంతుండై నన్నుఁ జూచి యలుకన్ బలికెన్. ౯౯.

మ. రమణీ యెవ్వతె విద్వనస్థలికిఁ జేరం గారణం బేమి యీ
సమరం బంతయు నీకతంబునఁ గదా జన్మించె నస్మద్వనాం
తము నీరాకనె భగ్నమయ్యె నిఁక సౌందర్యంబుతోడ న్నిలా
త్వము నైలొమ్మని శాపమిచ్చినను జింతం జెంది యే నంతటన్ ౧౦౦.



మ. అనఘా మత్పతి నిద్రవోవ ఫలమూలాన్వేషణార్థంబు నీ
వనికిన్వచ్చితి నన్నుఁ జూచి జనితవ్యాపాసులై వీరలీ
ఘనయుద్ధంబొనరింపఁగాఁ దొడఁగి రోకారుణ్యపూర్ణాత్మ యిం
కను శాపావధి దెల్పి నన్నుఁ గృపతోఁ గావంగదే వేఁడెదన్. ౧౦౧.

గీ. అనిన విని యమ్మునీంద్రుఁడు కినుక మాని । నన్ను దయఁ జూచి యిట్లను నలిననయన
నీప్రియుం డింపుఁ జనుదెంచి నీశరీర । మంటుకొనఁ గల్గుఁ జైతన్య మపుడు నీకు.

శా. ఆరీతి న్మునిరాజు పల్కుచు నె నేనట్లైతి నంత న్నృపుల్
పోరాటంబులు మాని యిద్దఱును దత్పుణ్యాటవీవాటికా
దూరక్షోణికిఁ బోయి రెంతయును నిర్ధూతాశులై తావక
శ్రీరమ్యాంఘ్రులుఁ జూడఁగంటిని ధరిత్రీవల్లభా నేఁటికిన్. ౧౦౩.

వ. అని యవ్వనిత తన వృత్తాంతం బెఱింగించిన విని రాజు వికసితనేత్రారవిందుండును బ్రమోద మేదురస్వాంతుండును నై యున్న యెడల నచ్చోటికి మకరందుండునుఁ దత్ప్రియసఖులునుం జనుదెంచి రంత నమ్మహీకాంతుండు నిజపురాభిముఖుండై చనుచుండె నటమీఁది వృత్తాంతంబు. ౧౦౪.

మ. శమితస్వాంతరమిత్ర మిత్రనిభ తేజఃపుంజ మంజుప్రతా
పమహత్త్వస్థిరగాత్ర గాత్రఘుహరప్రఖ్యాతిమత్పుణ్యభా
గమితోద్యద్గుణపాత్ర పాత్రధికసద్వ్యాపారశాహాగ్ర సం
భ్రమలీలాధృతగోత్ర గోత్రరిపుపౌరశ్రీలసచ్ఛాత్రవా. ౧౦౫.

క. నీలఘనాఘన గర్జా । కోలాహల వాక్ప్రచండ గురుగుణకాండా
లీలావతీ మనోభవ । లీలాదండోడుమండలీకరగండా. ౧౦౬.

పంచచామరము. సరోరుహాక్షపాదసారసద్వయీ విభావనా
ధరాసురాగతుల్య దానధారుణీ ధురంధరా
సురాపగాపటీర హీరశుభ్రకీర్తి భాసురా
చరప్రకాండ దండితారిజాల సద్గుణాంచితా. ౧౦౭.

గద్య. ఇది శ్రీవక్కలంక చంద్రశేఖర మహాకవిపౌత్ర భాస్కరసుకవిపుత్ర
విద్వజ్జన విధేయ వీరభద్రనామధేయ విరచితంబైన వాసవదత్తా
పరిణయంబను మహాప్రబంధంబునందుఁ
[చతు]ర్థాశ్వాసము.

## పంచమాశ్వాసము.

---

క. శ్రీలావణ్యవతీకరు । కాలద్ధైశ్వర్యధుర్య నగధైర్య దిగం
తాలంకృత నిజగుణమణి । జాలా మాధవనృపాల జననుతశీలా. ౧.

వ. అవధరింపు మనంతర కథాక్రమం బట్టిదియెడఁ గుసుమపురంబులోన. ౨.

క. చందనకవాట వరసం । క్రందనమణికుడ్య వజ్ర కమనీయధరా
వందనమాలాంచితమగు । కుందనపుం బనుల కొలువుకూటములోనన్. ౩.

సీ. ఒకచెంత వీరరాహుద్గణంబులలోన వందిబృందంబులు సందడింప
నొకదండ దండనాయకులలోఁ బలుమన్నె రాయబారులు ఘనప్రతిభమెఱయ
నొకచెంత బంధురాజకుమారవితతిలో హిత పురోహిత చమూపతులుమెఱయ
నొకపజ్జశాస్త్రజ్ఞ నికరంబులో మహాకవి సార్వభౌములు కడఁకనమరఁ
గనకకంకణ ఝుణఝుణత్కార మెసఁగ
రమణు లిరుచక్కియలఁ జామరములు వీవఁ
జెలువుమీఱంగ శృంగారశేఖరుండు
వాలిఁ బేరోలగంబున్న యవసరమున. ౪.

చ. మురిపపునెన్నడ స్జరణముల్గనుపట్టు నితంబమండలిన్
మెఱయు సువర్ణమేఖల సముజ్జ్వలమై తనరారఁ జెక్కులం
దొరఁగెడు ఘర్మబిందువులతో వదనాబ్జము వాడుచూపఁగా
బిరబిర నేగుదెంచె నొకబిత్తరి యత్తఱిఁ దత్తఱించుచున్. ౫.

ఉ. వచ్చినకాల్వసాల పెదవాకిలిచెంత నృపాలశేఖరుం
డచ్చిగురాకుఁబోఁడి వదనాబ్జముగన్గొని యింగితజ్ఞుఁడై
యచ్చటివారినేగుఁడని యంతిపురంబున కేగి గుంపులై
యచ్చెరువొందు సుందరులనందఱఁ గన్గొన వారు రాజుతోన్. ౬.

క. ధరణీశ యెవఁడో యంతః । పురమునకేతెంచి నిఖిలమోహన మాయా
గురుబలుఁడై జలజాస్యం । దరుణిం గొనిచనియె నీసుత న్నిర్భీతిన్. ౭.

ఉ. చిత్రము పోతుటీఁగయినఁ జేరఁగ నోపదటంచుఁ దెల్పఁగా
వృత్రహుఁడో మహేశ్వరుఁడో విష్ణుఁడో ధాతయొ గాక భూమిభృ
త్పాత్రున కిందుఁ జేర నగునాయని యద్భుతమంది యందఱున్
నేత్రములందు నశ్రువులునించి వచించినఁ జంచలాత్ముఁడై. ౮.



చ. కుసుమపురీశ్వరుండు దనకూఁతు విధం బవరోధభామినీ
విసరము దెల్ప శోకభరవిహ్వలుఁడై కడుచింతనొంది తా
దెసలకుఁ బంపువెట్టె నతిధీరుల ధీరతమీతి నేఁడు మీ
రసదృశభంగిఁబట్టి నరయుందగునంచు వచించియంతటన్. ౯.

క. చారుగుణయుతులు విమలా । చారులు చారులు నృపాలుచరణంబులకుం
జేరి నతిఁజేసి యపుడు ర । యారూఢ మనస్కులగుచు నరిగిరికడఁకన్. ౧౦.

సీ. వైజయంతీ సముజ్జ్వలమణిప్రాసాద బహుళ నానాదేశపట్టణములు
శుకపికశారికానికర కోలాహల ప్రకటిత కాననాభ్యంతరములఁ
గందరా మందిరాంగణనటత్కిన్నరగాన మనోహరక్ష్మాధరములు
మల్లికా వల్లికావేల్లిత సుమకుంజమదభృంగతతనదీనదతటములు
వెదకివెదకి వింధ్యవిపినమార్గంబునఁ । జనిన రాచకన్య జాడ లచటి
వారివలన నెఱిఁగి వారలంతటఁ గొన్ని । దివసములకు రాజుసవిధమునకు. ౧౧.

గీ. చేరి ముకుళితహస్తులై వారలప్ [illegible] ధారుణీనాథ మీపట్టిదారిపట్టి
చనికనుంగొంటి మవ్వింధ్యశైలసీ [illegible] భవత్పథమున నిజచమూసహితుఁడగుచు.

క. కందర్పకేతు నృపసం । క్రం[illegible]నితోఁగూడి [illegible]నూ[illegible]గాని హృదయా
నందంబున సఖుఁడగు మక । [illegible] నిజపురంబున కధిపా. ౧[illegible]

క. చనుచున్నవాఁడు తథ్యం । బన విని యప్పృథివీశుఁ డనుమోదించెన్
ఘనహితబాంధవలలనా । జనములు సంతసముగాంచి సరసతమెఱయన్.

సీ. బాంధవం బొనరింప భాషింప సములకేతగుఁగాని యొరులకుఁ దగదుగాన
రారాజతండు నేరాజ నాతనితోడ సముఁడఁగా నను లజ్జసంభవింపఁ
జర్చింపనైతి వాసవదత్తఁ గందర్పకేతునకును బెండ్లిసేతుననుచు
మత్పురాకృతపుణ్యమహిమచే నతనికి సుతనిచ్చి ఘనుఁడనై చూడఁగంటి
నిపు డటకుఁ బంపవలెఁ బురోహితుల ననుచు
ధరణిపతి మంత్రితోడ మంతనమొనర్చి
హితులకెఱిఁగించి నీతిసంయుతుల విప్ర
పుంగవులఁ బిల్వఁబంచి యుప్పొంగియపుడు. ౧౫.

గీ. విప్రులార వింధ్యవిపినమార్గంబున । మత్తనూజఁ గొనుచుఁ జిత్తమలరఁ
జనెడు రాజమౌళి జనమాన్యుఁ బాటలీ । పుత్రవిభునికడకుఁ బోయిమీరు. ౧౬.

మ. రమణి న్వాసవదత్త మత్తనయ శాస్త్రప్రోక్తరీతిన్వివా
హముగావించెద మెల్లి లగ్నమని మేమన్నట్లుగాఁ బల్కి చి

త్తము రంజిల్లఁగఁ జేసి మాయెడ నితాంతప్రీతి పుట్టించి నే
రము లెల్లన్ క్షమియించుమీ యని నృపుం బ్రార్థించి ధీచాతురిన్. ౧౭.

క. నా విన్నపంబు తగ న । భ్యావిభునకుఁ దెలిపి కుసుమపురిని వివాహ
శ్రీవిభవముఁ గైకొనుటకు । రావలెనని తోడుకొనుచు రావలె నటకున్. ౧౮.

మ. అనినన్ వేడుకతోఁ బురోహితులు వింధ్యక్షోణిభృత్ప్రాంతభూ
వనమార్గంబున కేగి కాంతఁ గొని శీఘ్రం బాటలీపుత్ర ద
ర్శనబుద్ధిం జనుచున్న రాజుఁ గని ధీచాతుర్య మేపారఁగా
వినుతుల్ సేయుచు డాయఁగాఁ జనిన యవ్విప్రోత్తమశ్రేణికిన్. ౧౯.

ఉ. మ్రొక్కి బహూకరించి నృపముఖ్యుఁడు నిల్చి మహాత్ములార మీ
రెక్కడనుండి వచ్చితిరి యేగెద రెచ్చటి కన్న వారలుం
గ్రక్కున మంత్రపూర్వకముగాఁ గయిదాల్చిన యక్షతంబుల
న్మిక్కిలి వేడ్కచే నృపుని మీఁద ఘటించి కరంబు లెత్తుచున్. ౨౦.

గీ. క్ష్మాపతీ పెండ్లికొడుకవు గమ్ము [illegible] వలాసంగి తమరాఁక దెలిపి కుసుమ
పురవిభుఁడు విన్నవించినకర [illegible] తమ పురికిఁ దెచ్చి రధిపు నద్ధరణిసురులు.

వ. అప్పుడు. ౨౨.

సీ. మకరందుఁడు నిజానుమతిని [illegible]సమంది అగఁ బాటలీపుత్ర నగరమునకు
ఫణిహారులనుబంపి బాంధవభటమంత్రిహితచమూపతి పురోహితుల నెల్ల
రావించుటయుఁ దూర్యరవ మల్లసిల్లంగ వందిబృందము మోదమంది పొగడఁ
గరితురగాందోళి కాచ్ఛత్రచామరధ్వజ ముఖ్యలాంఛనతతులు మెఱయఁ
గుసుమపురపుష్పితోద్యాన కుంజమంజు । పరిసరక్షోణికల్పితపట గృహాంత
రాళమునఁ బ్రాభవంబలరంగ విడిసె । ఖ్యాతచరితుండు కందర్పకేతు విభుఁడు.

ఉ. రాజితకీర్తిశాలి మకరందుఁడు వేడుకతోడ నయ్యెడన్
రాజువివాహ మెల్లియగు రావలె మీరని పిల్వఁబంపినన్
రాజకుమారశేఖరులు రమ్యవిభూష భోజ్వలన్మణీ
రాజులఁ గాన్కగొంచు నెదురం జనుదెంచిరి సంతసంబుతోన్. ౨౪.

క. సమధికమతు లవ్విప్రో । త్తము లవ్విభునాజ్ఞఁ జని ముదంబలర నను
క్రమముగఁ దెలుపఁగ విని సం । భ్రమమున శృంగారశేఖర ప్రభుఁ డంతన్. ౨౫.

క. మదిమోద మొదవఁగ సుదతుల । సదనము లలరింపఁ బనిచె సరభసగతితోఁ
ద్రిదివప్రభునిభుఁడై యపు । డెదురుగఁ జనఁదలఁచియున్న నెలమి దలిర్పన్.



సీ. హితు లమాత్యులు బంధుతతులు పురోహితు ల్దైవజ్ఞులు సమానధరణిపతులు
శృంగారవతులుఁ దురంగమారూఢులు వేత్రహస్తులు దార ల్వ్యగభటులు
సాందోళికా గజస్యందన వాహను ల్చామరధ్వజ సితచ్ఛత్రకరులు
వీరకాహళ భేరికారవప్రకటిత తూర్యనిస్వన సముద్యోగ చణులుఁ
జెలఁగి తనుఁ గొల్వ శృంగారశేఖరుండు
మదినిఁ జెలరేఁగి పెండ్లికుమారుఁ బిల్వ
నెదురుగా నేగుటయుఁ బురోహితులు పెండ్లి
వారితోడ నెమరొక్కనవలయుననిన. ౨౬.

వ. అంత నవ్విధంబున నవ్వైవాహికు లిరుగెలంకులం దలంకక నిలిచి పటహ ఝర్ఝర
ఝల్లరీ భేరికా వీరకాహళాది విరావంబు బధిరీకృతహరిదంత దంతావళంబై
రోదోంతరంబు నిండి ప్రావృడారంభవేళా సముజ్జృంభితాంభోధరఘోష నను
కరింప నుండోరులు చండకరమండలతేజః పిచండిల మణికుండలమండిత గండ
ద్వయులు బాకచక్యహారకేయూరాది భూషావిశేషిత భూషితులును భూషి
తాశేషవస్తువాహన సంపత్ప్రశస్తి విస్తారిత నిస్తులాశోక మహిమాభిరాములును
మహిమాభిరామ సామర్థ్య సమాసాదిత సామంతసీమంతినీ విరచితోపచార
సౌభాగ్యధురంధరులునై గంధసింధుర బంధురమంధర గమనంబులతో మంద
మంద చందనాచల మరుత్కందళకాందిశీకశ్రమ బిందుసుందరవదనేందుకందళిత
మందహాసవిలాస భాసురలీల నలరుచు సుగంధ బంధురగంధచూర్ణంబులు చల్లు
లాడుచు సల్లలితసరససల్లాపంబుల నృత్తగీతవాద్యహృద్యవేణువీణారవాకలనంబుల
నానందింపుచు నెదుర్కొను సమయంబున నస్తాచలాగ్ర ప్రత్యగ్రపద్మరాగ
దేదీప్యమానరుచి రుచిరచ్ఛాయావల్లభుండును పూర్వాచలసౌధాగ్ర సముత్తుంగ
మంగళ వజ్రకలశ సంకాశకాంతి నోషధీకాంతుండును దదీయభవ్యప్రతాప
మంజులకీర్తి పుంజంబులు మూర్తీభవించిన చందంబునఁ దన్మహోత్సవవిలోకన
సముత్సుకులవిధంబునం గొంత సేపు నిల్చుటయు నంత సమస్తమహీభృదంగీకృతాం
బర మణిమండలంబును నరుణాంగరాగరంజిత ఘనాభిరామంబును దరుణతమ
స్ఫురణంబును దారావిరాజమానంబును సముద్దీపిత చంద్రజ్యోతిః ప్రకాశం
బునునై యంబరంబు నవనీతలంబు నొక్కవిధంబున నుండఁ గరదీపికా సహస్రస
ముద్దీపిత చిరత్నరత్ననూత్నప్రకాశంబును దురంగతరంగసంగతంబును గరటి
ఘటానక్రావక్రంబును శతాంగనౌకాసంగతంబును శిబికారూఢ వైవాహిక
సాంయాత్రికంబును నై యబ్బలాంబురాశి పురేందిరావిలోకన కుతూహలంబునం

అనుడు శ్రీవత్సలాంఛన లాంఛితుండును విశేషాంచిత నిజవిగ్రహుండును శ్రీలాలోల లీలాలాలితుండును వాహినీప్రభుమధ్య సంస్థితుండును నగునవ్వరపుం దరీకాంతుని పైఁ బ్రాసాదాగ్రంబులపై నిలిచి పుణ్యకాంతావతంసంబులు చల్లు లాజావ్రజంబు సౌధయూథ మందరశిఖరపరాహతనాసీర పారావార పయోబిందు సందోహంబు చందంబున నందంబై సముత్ఫుల్ల మల్లికానుకారంబులతోఁ దోరంబుగా సేనాపరాగ వారిహాహాకరకావర్షంబు ననుకరించ నాశీర్వచన పూర్వకంబుగా నుర్వీసుపర్వసార్వభౌములు సర్వసర్వంసహాధూర్వహుండగు నమ్మనుజవల్లభునిపై సమ్మదంబున నార్ద్రార్ద్రహారిద్రా ముద్రితాక్షతంబులు దుప్పిననవిదెప్పరంబుగ నుప్పరం బెగసి కుప్పకుప్పలై యొప్పులకుప్పయగు నప్పుడమితేనిపైఁ గప్పిన దుప్పటంబులపైఁ గప్పి తదీయ సౌవర్ణచ్ఛాయాదాయాదంబులై యంబరంబున నిలిచి తన్మహోత్సవవీక్షాదక్షులై వచ్చి వియచ్చరులిచ్చ మెచ్చి విచ్చలవిడిం గురియించిన కాంచన కుసుమవర్షంబు డంబు విడంబింపుచునుండ నప్పుడా విభుండు పురాభ్యంతరంబునం జనునవసరంబున. ౨౮.

చ. ప్రమదముతోడ సేనకగు భామిని నీతనికన్నరీతి సం
భ్రమమున డాసి యొండొరులపైఁ బడుచుం దమిహెచ్చ నయ్యెడన్
రమణులు పద్మరాగమణి రాసులమీఁదికి నెక్కి నిక్కి భూ
రమణునిఁ జూచుచుండిరి పురస్థమణీ విపణిస్థలంబులన్. ౨౯.

చ. దళముగ నీలరత్నములు దాచిన విప్పగు మేడమీఁదటం
గలికి యొకర్తు భూవిభునిఁ గన్గొన సోరణగంటి చెంగటన్
నిలిచినఁ దద్గృహంబలరె నిశ్చలవిద్యుదురుప్రకాశతం
బొలిచిన నీలమేఘమనఁ బొల్పుగఁ బట్టణ రాజవీథిలోన్. ౩౦.

ఉ. ఆసవగంధబంధురము లౌ వదనాబ్జములెత్తి నింగిపైఁ
దాసిన మేడలందాగి మిటారులు నిల్చి నృపాలుఁ జూడఁగా
భాసిలె జాలమార్గములు పంకరుహాకర విభ్రమంబులో
నాసమయంబునందుఁ బ్రమదాననపజ్జులె గాననొప్పఁగన్. ౩౧.

చ. తరుణియొకర్తు తేనిఁ దమిఁ దప్పక చూచి తదీయరూపమో
వరినిలిఖించి తన్న చటప్రాయఁగఁ దద్విభుఁ డుండఁ జేర న
గ్గురుకుచ నేర్పుతో నృపునకు న్సుమచాపము చేత వ్రాసె న
ద్దిర యదియొంత ప్రౌఢసుదతీమణియో పరికించి చూడఁగన్. ౩౨.



సీ. అరదంబు లాఁకసి కస్తురిబెల్లు లురిలినయిరుఁగులు జవ్వాదినలుకువారు
తురగముల్ద్రొక్కఁ గప్పురపుదుమ్మాగసిన సరణులఁ బన్నీరుచల్లువారు
ధ్వజదండ హతిఁ గందు తలిరాకు తోరణంబుల హరిన్మణులు గీల్కొలుపువారు
రాజుమోమరసి కరంగిన శశిమణిస్థలముల వజ్రముల్దార్చువారు
నై జనులు పురిఁ గైసేయునవసరమున । ఖ్యాతవిభవుండు కందర్పకేతు నృపతి
కుసుమపురపతి యనుమతి నసదృశగతి । సిరులకిరవైన విడిమట్టుఁ జేరెనపుడు. ౩౩.

క. ఆసమయంబున రాజా । జ్ఞాసూచితయగుచు వేడ్క జలజాతాస్యల్
దాసికలు వంగ జనకా । వాసము సొత్తెంచుచున్న వాసవదత్తన్. ౩౪.

గీ. కనిజననియుక్కననుఁ జేర్చి జనకుఁ డంతఁ । బ్రేమశుద్ధాంత కాంతలఁ బిలిచి యపుడు
చంద్రవదనకు మంగళస్నానవిధులు । సలుపవలెనన మదిఁ బొంగి లలనలంత. ౩౫.

సీ. పగడంపు గుంద్రకంబములపై నెలకొల నలరారు దూలంబులందుఁ గీలు
కొన్న కెంపుల జిగి వన్నెపట్టెలమీఁదఁ జాఁపమే పరిపచ్చ పలకలలరు
పందిరిలో నవపల్లవతోరణంబులఁ గదళీస్తంభములను గనక
పూర్ణకుంభంబులఁ బొల్పగు నవరత్నమయ శుభవేదికామధ్యమునను
బిసరుహానన లొక పెండ్లిపీటఁ బెట్టి । తలిరుఁబోఁడిని వాసవదత్తనునిచి
వరుసతో ముత్తైదువలు నిల్చి దీవనలొసంగి । యక్షతములిడి గౌరికల్యాణమనుచు. ౩౬.

సీ. గురుకుచంబులఁ బెనఁగొన్న హారావళు ల్పయ్యెద వెలువడి బయలరాఁగ
నరచందమామతో సరివచ్చు నిటలంబుపైఁ గుంతలంబులు పరుగులెత్త
దిటము చాలక గిటగిటమను కౌఁదిఁ గె యంబరావృతి నసియాడుచుండ
శ్రమసముద్భూత నిశ్వాసానిలము తావిగొన భృంగములు గుంపుగూడి చేరఁ
జెలఁగి నెమ్మొగమునఁ జిఱుచెమటలూరఁ
గలితకంకణ ఝణఝణత్కారమెసఁగ
మానవతి యోర్తు సంపెంగనూనె యంటె
నతిముదంబునఁ బొంగి యయ్యలివకపుడు. ౩౭.

సీ. కపురంబు జవ్వాది కమ్మకస్తురి హారిద్రయుఁ గూర్చి నలుగిడె రమణియొకతె
గమ్మనవలచు చొక్కపు మంచిగంధంపు టటకలివెట్టె వామాక్షియొకతె
సలిలశాలకుఁ దెచ్చి కలువరాపలకపై నిలిపె మక్కువతోడ లలనయొకతె
బంగారుబిందెలఁ బన్నీరు ధారలించి జలకమార్చెఁ గడంక నెలఁతయొకతె
జిలుఁగు దువ్వల్వ కెంగేల నలవరించి । కదిసి తడియొత్తె నొక్కపంకజదళాక్షి
వ్రాఁత బెళుఁగుల చెంగావి వలువఁ గట్టె । నిచ్చ నొకబాలికామణి యిందుముఖికి.

చ. నళినదళాంతవృంత పవనంబులచేఁ దదియార్చి పెన్నెరు
ల్గలయఁగ దువ్వుచుం గుసుమగర్భముగాఁ జెలియోర్తు కైశికం
బలవఱుపం బయోజముఖి యాస్యముచూడఁగ నొప్పె నయ్యెడన్
లలితమిళిందబృంద పరిలక్షిత ఫుల్లసరోజమోయనన్. ౩౮.

ఉ. పంకరుహాక్షికి న్నిటలభాగమునం గొనగోరఁ దిన్నఁగాఁ
గుంకుమరేఖదిద్దె నొక కుంజరయాన సరోషచిత్త మీ
నాంకధనుర్విముక్త దళితాఖిలపాంథశరీర శోణితా
లంకృతివిభ్రమాశుగసులక్షణలక్షితలీలఁ బొల్పుగన్. ౩౯.

క. ఉడురాజబింబ వదనకుఁ । గడఁకం గడకన్నులందుఁ గజ్జలమిడె న
య్యెడ నాకపడంతి చెలువల । రెడు చాతుర్యమున సొగసు రెట్టించంగన్.

చ. పొలఁతు లమూల్యదివ్యమణిభూషణ పేటికఁ దెచ్చి యందులోఁ
గల మణిభూషణావళులుగ న్గాని కాంచనపద్మపత్ర మం
జులమగు లేమ మైసొబగుఁ జూచి సఖీమణి మేని కాంతితోఁ
దులగన వావిభూషణతతు ల్నిజమంచు వచించిరయ్యెడన్. ౪౧.

క. అద్దముఁ జూపెను జెలి యొక । ముద్దియ సఖి నీదుముద్దుమోము సమమనం
గద్దలికఁ దెచ్చిరి నీ । వద్దికి నిదె చూడుమనుచు వచియించుగరిన్. ౪౨.

సీ. ముంగరచేర్చుక్క ముత్తియంబులజల్లి జవిరెలుఁ గమ్మలు కావిలీలుఁ
బతకమ్ము ల్గాలుసులుఁ బన్నసరంబులు గ్రైవేయకంబులు నేవళములుఁ
గడియంబులును సూడిగంబు లుంగరము లంగదములు గంటలకాంచికయును
నందియలును మట్టియలు వీరమద్దెలుఁ గటకుల బాబ్బిలికాయ జోళ్ళ
ననఁగఁ బేరెన్నికైనట్టి కనకరత్న । ఖచిత భూషావిశేషము ల్గ్రిమముతోడ
మించుబోఁడికి మై నలరించిరపుడు । చంచలాక్షులు మదిఁ బొంగి సరభసమున.

వ. అంతనక్కడ. ౪౪.

ఉ. అంగనలోర్తు పీటయిడె నంబుజలోచనలోర్తు రాజమూ
ళింగడు పేడ్క నందునిచె లేమయొకర్తు నృపాలదత్త ర
త్నాంగద ముఖ్యభూషణము లందుకొనెం గలకంఠయోర్తు తె
చ్చెం గనకస్థ సౌరభవశీకృతతైలముఁ బైఁడిగిన్నియన్. ౪౫.

చ. కులుకుమిటారి గబ్బిచనుఁగొండల హారలత ల్నటింపఁగాఁ
గలనినదంబుతోడఁ గరకంకణము ల్మొరయంగఁ జూర్ణ కుం
తలములు ఫాలభాగమునఁ దాండవమాడఁగ సంతసంబుతో
నలికులవేణియోర్తు శిరసంటె నృపాలకచక్రవర్తికిన్. ౪౬.

చ. గిటగిటఁ జేదకాను వడఁకింపుచుఁ గస్తురి నల్గుపెట్టె ను
త్కటకటకధ్వను ల్చెలఁగఁ గామినియోర్తు శిరోరుహంబులం
దటకలిపెట్టు గందమున నంగనయోర్తు కటీతటీనట
త్పటయగుచున్ రయంబున నృపాలకమౌళికి సంతసంబుగన్. ౪౭.

క. కైదండ యొసఁగె నపుడొక । పైదలి నడపించె సలిలభవనంబునకున్
వేదండయాన యొక్కతె । యాదరమున నవ్వసుంధరాధీశ్వరునిన్. ౪౮.

చ. అనుపమరత్నపీఠమున నద్ధరణీవిభునుంచి యొక్క మా
నిని మణిపూర్ణకుంభములనించిన గొజ్జఁగినీరుముంచి మ
జ్జనమొనరించె నొక్క నవసారసలోచన జిల్గుదుప్పటం
బునఁ దడియొత్తెఁ బెన్నెరులు భూపవరాగ్రణికిన్ రయంబునన్. ౪౯.

క. జలజాస్యయొకతె జిలుఁగుం । జలువలుఁ దెచ్చి యొసఁగె నొకసతి గద్దయిడెన్
గలకంఠి యొకతె కస్తురి । తిలకముఁ గొనగోర దిద్దె ధీరాగ్రణికిన్. ౫౦.

సీ. తనుకల్పతరుసుమ స్తబకంబులనఁ దెల్వెఁ బొలుచు ముత్తియముల పోగుజోళ్ళ
గ్రహములన్నియు ననుగ్రహము సేయఁగఁ దాసినట్లున్న నవరత్నహారములును
హస్తపద్మములపై నంటినయళులనా రంగైన నీలంపుటుంగరములు
నుదయాచలంబుపైఁ గదలని జాబిల్లిఁ బోలు వజ్రపుశిరోభూషణంబు
దాల్చెనప్పుడు ధారుణీధవుఁడు మఱియుఁ । దగినభూషావిశేషము ల్దలిరుఁబోండ్లు
మేనఁ గైసేయ వలరాజు మేనమామ । రిక్కగమిలోనఁ జెలువొందు రీతినలరి.

ఉ. గద్దపుమించునించుఁ బురణించు జిగిం దులకించు మేలుదా
లద్దముఁ జూపె నొక్క ముకురాస్య నృపాలునిముందట న్నృపా
యద్దపుసొంపు గేరుఁగనుమా యనుమానము వద్దువద్దునా
ముద్దుమొగంబు తీరు తుదిముట్టఁగ నంచు వచించు వైఖరిన్. ౫౨.

వ. అయ్యవసరంబున. ౫౩.

చ. తడవడ లేదు లగ్నమిదె తారసిలెం గదయంచు బ్రాహ్మణు
ల్బుడిబుడిఁ బల్కుచుండ నరపాలకుఁ డందలమెక్కి తూర్యముల్
గడలుకొనంగ సద్భటనికాయము గొల్వఁగ వేడ్క వచ్చి య
ప్పుడు శుభవేదికానికటభూమి వసించెను సంభ్రమంబునన్. ౫౪.

ఉ. బంగరుగద్దెపైఁ దగు నరపాలవరేణ్యుని జొక్కి హేమగౌ
రాంగి మృగాక్షియొక్కతె రయంబునఁ గెంపులగిండినీరుపో
యం గడిగెం బదంబులొకయంగన రంగలరంగ భీత సా
రంగవిలోల దృక్చల తరంగములం గడుపెల్లి దెల్పుచున్. ౫౫.

క. ఆరతిపళ్ళెరములు దై। వారఁగఁ జేసేసి వారిజాస్యలు వేడ్కన్
నీరాజనము లొసంగిరి। యారూఢిగ నమ్మహీతలాధీశునకున్. ౫౬.

క. కుసుమపురవిభుఁడు రయమున। నసమప్రాభవసమేతుఁడై యచటికి నిం
పెసఁగఁ దనూభవఁ దెమ్మని। బిసరుహలోచనలఁ బంపువెట్టిననంతన్. ౫౭.

సీ. కంకణ ఝుణఝుణత్కారంబు రెట్టింప సుందరీమణియోర్తు సురటివీవ
నూర్మికామణి సుప్రభోర్మికతై యయఁ గోమలియొకర్తు తెలనాకుమడుపులొసఁగ
నరిషేదకాననసియాడుచుండఁగ నొక్కచాన పైయెదకొంగు చక్కఁజేయ
బిగిచూపు నిగిడించి మగువయొక్కర్తు పైఁబడు సుందరుల బరాబరులుసేయ
రమణు లిరుచక్కియల ధవళములఁ బెండ్లి। పాటలను బాడుచుండ వైభవము తోడ
వచ్చి జనకుని దరినొప్పె వనజనయన। తెరమఱుంగునఁ గ్రొమ్మించుఁ దీవెయనఁగ.

వ. అప్పుడు. ౫౯.

సీ. కుసుమదామంబులు ఘుమఘుమసౌరభ శ్రీగంధమును హేమచేలములును
గర్ణభూషణము లుంగరము లంగదములుఁ బచ్చలకడియము ల్పతకములును
బంగారుగొడుగులుఁ బల్లకు లశ్వజాతంబులు భద్రదంతావళములు
నాందోళికలు మణిస్యందనబృందంబు లార్యవర్ణిత గోసహస్రములును
మొదలయిన పారితోషికముల నొసంగి
పూర్వ శాస్త్రోక్తముగ ధారవోసె స్వతను
జాతనప్పుడు పత్నీసమేతుఁడగుచుఁ
జెలఁగి వరునకు శృంగారశేఖరుండు. ౬౦.

మ. అలరుంజప్పర మప్పరంబలమి సొంపార న్మణిస్ఫూర్తి మం
జులమౌ కౌతుకవేదిమీఁద సుజనస్తుత్యాకృతి న్నిల్చి మం
గళసూత్రంబు నృపాలశేఖరుఁడు వేడ్కం దత్పయోజాననా
గళసీమ న్ఘటియించె బంధుజనవర్గం బాత్మనుప్పొంగఁగన్. ౬౧.

వ. అంత. ౬౨.

క. పతిసతిపై సతిపతిపై। నతులిత చతురతలఁ జల్లులాడిరి ధవళా
క్షతమౌక్తికములు దలఁబ్రా। లతి కుతుకితులగుచు సుమతు లభినందింపన్. ౬౩.



చ. చెలువయుఁ జెల్వుఁ డొండొరులఁ జేరి ఘనాక్షతమౌక్తికవ్రజం
బులు నిజమస్తకాగ్రములఁ బూనుపఁ జిందఱవందతైన సే
సలు కరమొప్పెఁ దత్కరవిసారివిభాకచదేహ సుప్రభా
కలన విచిత్రరత్నముల కైవడిఁ జూపరకద్భుతంబుగన్. ౬౪.

క. పతి యనుమతి మతిఁబూనిన। సతి గుణవతి గతివిజితవశాప్రతతి వరుం
ధతిఁగని మ్రొక్కిరి ధరణీ। పతియును మదవతియు శ్రీవిభాసురలీలన్. ౬౫.

సీ. స్వాహాస్వధావధూ మోహనాకారు భూమ్యమరసేవ్యుని జగత్ప్రాణసఖుని
సప్తజిహ్వుని మహౌజస్సమన్వితు మేషవాహను సర్వగీర్వాణవదన
సంకాశమూర్తి వైశ్వానరుఁ బాదత్రయోపశోభితు వీతిహోత్రు శుచిని
జాతవేదుని ధనంజయు గౌరవర్ణుని శక్త్యాదిసాధన సప్తహస్తు
నగ్నిదేవుని విధ్యుక్తమగు విధమున। నిలిపి సమిదాజ్యచరుతృప్తిసలిపిరపుడు
శ్రుతియుక్త సదాచారసరణి మెఱసి। సర్వజనసమ్మతంబుగ సతియుఁబతియు.

క. నిగనిగ కనుఁగవ కాటుక। దిగజాఱఁగ గండఫలకదీప్తులు మెఱయన్
మగువకు నగుమొగమలరెన్। భుగభుగమను హోమధూమపుంజంబాదవన్.

మ. చతురంతోన్నతవేదిపై మణిగణాంచ త్స్వర్ణపీఠంబునం
దతిమోదంబునఁ బొంగి దంపతులు దారాసీనులై బ్రాహ్మణ
ప్రతతు ల్దీవనలియ్యఁ గాంతలు హరిద్రాముద్రరంజిల్లు న
క్షతముల్చల్లఁగ నుల్లసిల్లిరి సదాచారంబుతో నంతటన్. ౬౮.

మ. ధరణీనాథకులావతంసము జనస్తవ్యుండు శృంగారశే
ఖరుఁ డత్యంతము భక్ష్యభోజ్యములఁ దత్కాలంబునం బంధుభూ
వరులం దృప్తులఁజేసి నాల్గుదినము లవ్వప్రాభవం బేర్పడన్
వరుఁ డంతన్ గృతశేషహోమవిధియై వామాసమాయుక్తుఁడై. ౬౯.

ఉ. బాలిక లబ్జరాగమణిభవ్యమణు ల్పముకూర్చి వేడుకన్
బ్రోలు రచింపఁ జిత్రసుమపుంజములొప్ప సరోవరంబు శుం
డాలము పే వశావశత డాయు విధంబునఁ జొచ్చె నంగనా
జాలము నాగవెల్లి వరుసన్ సమకూర్పఁగ సంతసంబునన్. ౭౦.

వ. ఆసమయంబున. ౭౧.

సీ. గజపతి మదినిసఖ్యంబెంచి పంపె మోదంబుతో భద్రదంతావళములు
మలయాద్రినేలు భూతలనాథుఁ డర్పించె ఘనతర శ్రీఖండఖండవితతిఁ
దామ్రపర్ణీతీర ధరణీశ్వరుం డిచ్చె మేలురమంజి ముత్యాలసరులుకొన్ని

ద్వీపాంతరపురాజు దెచ్చెఁ దా ననుపమ చీనీచీనాంబరశ్రేణు లెల్ల
మఱియుఁ దగు రాజు లెల్ల సమ్మదముతోడ । మణితురంగమసుందరీ మణిసువర్ణ
భూషణంబులు తగు కట్నములుగ నొసఁగి । రతిముదంబునఁ బొంగి ధరాధిపతికి.

వ. ఇవ్విధంబున నవ్వివాహమహోత్సవంబు సమగ్రంబగుటయు ననంతరంబ. ౨౩.

క. కందర్పకేతుఁ డమ్మక । రందునితో వేగ నిజపురంబు ప్రవేశం
బందగు ననుటయు సేనల । నందఱ నడిపించెనట్లు యానసమయమునన్. ౨౪.

క. జననీజనకులు గారా । మునఁ బెంచిన గోలగాన ముందుగ నత్తిల్
గనఁ జనుటకుఁ దలఁకెడు న । వ్వనితామణిఁ గని యనంగవతి యిట్లనియెన్.

క. బాలా యత్తిలు చూచెద । వేలా యీలాగు దలఁక హృదయేశుఁడు నిన్
లాలించును నగపేటికిఁ । జాలింపుము చింత వికచసారసనయనా. ౨౬.

ఉ. అత్తకు నాఁడుబిడ్డ కెదురాడకుమమ్మ నిజేశుఁ డల్గినం
దత్తఱమందకమ్మ పతిదైవము నిక్కువమమ్మ యెప్పుడుం
బత్తియొనర్చు నాథుఁడని పల్కు మునిక్కకుమమ్మ యమ్మ నీ
వత్తిలు చొచ్చి బాంధవుల నందఱఁ బ్రోవఁగదమ్మ యిమ్ముగన్. ౨౭.

చ. చెలువుని చిత్తవృత్తిఁ గని సేవ యొనర్పుము తల్లి యత్తమా
మల భయభక్తులందనుపు మాన్యమహీసురబాంధవాశ్రితా
వళులకు నిష్టవస్తువు లవారితలీల నొసంగు మెప్పుడుం
బొలఁతి యశంబుఁ దేఁగలవు పుట్టిన యింటికిఁ జొచ్చినింటికిన్. ౨౮.

ఉ. పంకరుహాక్షి నిన్నిలువఁ బంపెదఁ బక్షములోన నెమ్మదిన్
జంకఁగ నేల సర్వజనసమ్మతరీతిని నత్తవారిలోఁ
బొంకము గాఁ మెలంగు నినుఁ బోటులు సంతసమందఁ జూడ నే
శాంక కళావతంసునుమయట్ల భజింపుము ప్రాణవల్లభున్. ౨౯.

గీ. తల్లి చింతఁ దూల తలయెత్తి ననుఁ జూడ । వమ్మ నన్నుఁ గన్నయమ్మ యనుచు
వరుసతో ననంగవతి యిట్లు బహుభంగిఁ । బట్టి నూఱడించి పలికె నంత. ౩౦.

సీ. శృంగారశేఖర క్షితినాథుఁ డవ్వేళ వరుసతోడ ననంగవతికిఁ దనకుఁ
దగిన సమస్త బాంధవులకు మ్రొక్కి వాసవదత్తఁ బలికించి సరభసమున
నూఱడించి యనేక ధారుణీసుర మంత్రిభటహిత యాచకప్రతతితోడఁ
గందర్పకేతు భూకాంతుండు పాటలీపుత్రంబునకుఁ జనఁ బూని తెలిసిఁ గి
యల్లునిని మాటికిని గౌగిలియాడి యాడి । యస్సు లనుచుఁ దనూభవ నప్పగించె
నాఁడుబ్రతుకు పరాధీనమనుచు నచటి । యంగనలు మాటిమాటికి నాడుకొనఁగ.



సీ. నవరత్నమయభూషణములు బంగరుకోళ్ళ పట్టెమంచములు పూఁబట్టుపరుపు
లనుపమవర్ణ చీనాంశుకంబులు జాలవల్లికల్ తబుకులు వ్యజనములును
బటవాసముఖ బహుపరిమళద్రవ్యముల్ శారికాకీరపంజరచయములు
నిలువుటద్దంబులు వెలలేని బరిణెలు జాళువా పావలు చందువాలు
మొదలగు పసదనములు సమ్మదముతోడ । నాత్మజకు నిచ్చె నత్తింటి కనుచునపుడు
శ్రీలు మీఱ శృంగారశేఖరుండు । నపుడు బాంధవు లెల్ల నౌ ననిసరింప.

ఉ. ధరణీనాయకరత్న మయ్యెడ సమస్తబ్రాహ్మణాశీర్వచ
స్స్ఫురితప్రాభవుఁడై శరత్సమయ సంపూర్ణేందు బింబాననల్
వరుస న్నాట్యము సల్పఁ దూర్యరవముల్ వ్యాకీర్ణత న్మ్రోయ నం
బరమున్నిండఁగ నాత్మపట్టణము కుంభఝల్లిలఁ జొచ్చె సిరిన్. ౩౩.

వ. అయ్యవసరంబున. ౩౪.

సీ. చంద్రశాలాంతరస్తంభజృంభిత మరకతమణితోరణావృతనభంబు
నాగుల్ఫకీర్ణ నానానూనసూనప్రతానమానితనిషాద్యానుతంబు
కాయమానాసమానాయత ముక్తావితానాంకితాఢ్యవస్త్రవ్రజంబు
నగరుధూపోద్ధ ధూమాళిక జలధరోదయ నటద్భవనచంద్రకి గణంబు
రాజబింబాననాకరరాజమాన । రత్నకల్పిత మంగళారాత్రికంబు
నగుచుఁ దనరారెఁ దత్పురాభ్యంతరంబు । రాజరాజకు ముదమునఁ జెజరిల్లి.

క. ధరణీశ్వరుండు సుదతీ । కరగ్రహమహోత్సవంబు గైకొని కడఁకన్
గురుబుధబాంధవలలనా । పరివృతుఁడై వచ్చెననుచుఁ బట్టణవీథిన్. ౩౬.

సీ. తురుమునఁ జెంగల్వ విరిదండ దిగజాఱ తెఱఁగక చనుదెంచె నింతియొకతె
పదములు యావకాస్పదములుగాఁ జేయ మగువఁగాదని వచ్చె మడఁతియొకతె
విడవిడఁ బాఱు నీవీబంధ మొకకేలఁ గీలించి చనుదెంచె బేలయొకతె
కుడికంటఁ గజ్జలంబిడుకొని డాకంటఁ దాల్పక వడిఁ జేరెఁ దన్వియొకతె
సౌధవాతాయన ప్రదేశములకట్లు । చంద్రముఖు లెల్లఁ గడురభసమునఁ జేర
వచ్చి యవ్వేళ నానందవార్ధిఁ దేలి । పెండ్లికొమరునిఁ జూచిరి ప్రేమ మొసఁగ. ౩౭.

వ. అప్పుడు. ౩౮.

ఉ. మంగళగీతముల్ చెలఁగ మానినులారతులీయ వేడుకన్
బంగరుపల్లకీ డిగి నృపాలుఁడు తూర్యనినాదము ప్పఁగా
నంగనతోడ నాత్మభవనాంగణవాటికఁ జొచ్చెఁ బౌరులు
పొంగుచుఁ గొల్చిరా ధరణిపుల్గడు సంతసమొందఁ జూడఁగన్ ౩౯.

వ. ఇవ్విధంబున నవ్వసుంధరాతిలేశ్వరుండు సతియుందాను గృహప్రవేశంబుచేసి కృతకృత్యుండై వివిధబాంధవసందోహ యాచకవ్రాతంబుల యథార్హవస్త్రప్రదానంబునందనిపి సకలదేశాగత రాజవర్గంబున కాజ్ఞయొసంగి యంతఃపురంబునకుం జని యొక్కనాఁడు. ౯౦.

సీ. కలకలనగుమేలుకట్టురంగెుఁగించు నీలపురాకట్టుసేలతోఁడ
గలరవంబుల శారికలపల్కులాలించు రాచిల్కగమి పంజరములతోడ
ధళధళమెఱయు నిద్దపుట్టద్దములఁగాననగు బ్రాఁతబొమ్మల సొగసుతోఁడ
దలిరాకుగములఁ గెందమ్మిరేకులఁగూర్చి పన్నిన క్రొన్నన పాన్పుతోడ
స్ఫుమరపటవాస ఘుమఘుమంఘుమలతోఁడ
గమలమాణిక్య కృతకవాటములతోఁడ
సమలయానిల వాతాయనములతోడ
సమ లయాన్విత కేకి నాట్యములతోడ. ౯౧.

సీ. ననవిలుకాని మన్ననగన్నవనెడు పూగములతో నవ్యపూగములతోడ
దళములౌ తాంబూల దళములఁదగుకరంకములతో మృగమదాంకములతోఁడ
గదలికల్ లేని యక్కడలికత్తెలయయ ద్వారములతో సలిలపూరములతోడ
నెలరాలనలరుతిన్నెలఁబొల్చు గంధసారములతో నళివిహారములతోఁడ
జకచకలహెచ్చు సాలభంజికలతోఁడ
బ్రమదములొసంగు నగరుధూపములతోఁడ
బ్రభలవెలిఁగెడు కేతనప్రతతితోఁడ
గొమరుమిగిలిన కేళిగృహమునకరిగి. ౯౨.

చ. పగడపుఁగోళ్ళఁ జందనపుఁబట్టెలఁ జెన్నయి పద్మరాగపుం
బొగడలనంటి కెంపు జిగిఁబొల్పగు వ్రాఁతల మేలుకట్టుతో
సొగసగు పందిరింగలిగి శోభిలి మానసభూనిధానమై
భుగభుగతావు లీనుకొను పూవులపానుపుమీఁద నున్నెడన్.  ౯౩.

సీ. గోవజవ్వాదినిగ్గులు బయల్పడకుండఁ గలయగొజ్జఁగినీట జలకమాడి
తరుణారుణాంశు సుందరతరద్యుతులఁ జెన్నలరారు కెంబాయవలువఁగట్టి
యగరుధూపంబుచేనార్చి చిక్కుసడల్చి కురులుచక్కఁగదువ్వి తురుము దురిమి
నొసటఁ గస్తురినామమెసఁగఁ బాలిండ్లపై ఘనసారకాశ్మీరగంధమలఁది
నవ్యకాంచనమణిభూషణములు మేనఁ। దాల్చి చెలువొందు వాసవదత్త కడకు
నృపవరప్రేష్యనూణయై నెలఁతయొకతె। వచ్చియిట్లనిపల్కె భావంబుదెలియ.



మ. కులుకుంగుబ్బల కబ్బు వింతలగు రంగు ల్మీదుకెమ్మోవికిం
గలుగు స్వేఱొకడాలు చెక్కులపయింగన్పట్టు మేలైన చి
న్నెలు నెమ్మేనికినెల్లఁ జేరఁదగు వన్నెల్మిక్కు మెన్నంగ నో
కలికీ నీకు నభీష్టసిద్ధియగు వేగ న్నమ్ముమీనెమ్మదిన్. ౯౫.

క. శంకయిఁక నేల పదరా। పంకేరుహనయన ధరణిపాలక వరవా
మాంకస్థాయిని వగుదువు। సంకేతస్థానయాన సమయమిదిచెలీ. ౯౬.

చ. కమలదళాక్షి నీకు నుపకారమొనర్చు విధంబు దోఁచఁగాఁ
గమలహితుండు గ్రుంకెఁ బొడకట్టె శశాంకుఁడు తూర్పుకొండపై
రమణుఁడు నీదురాక కనురాగమునం గనిపెట్టియుండు నీ
గమి యటురాఁదగుం దెలియఁగారణ మే మిఁక జాగుసేఁతకున్. ౯౭.

క. అనిపలుకుచున్న దూతికఁ
గని సిగ్గున మోముద్రిప్ప కమలాయతలో
చనఁజూచి సకియలందఱు
ననవిలుతునియాజ్ఞఁ దెలిపినను జెలి యంతన్. ౯౮.

సీ. కనకపంజరశారికల ముద్దుగుల్కుపల్కులు వినునెపమునఁ గొంతసేపు
సంచబోదల నడల్గాంచి సంతోషించుకొనువిధంబేర్పడఁ గొంతసేపు
నీలవేదులనాటనెఱిపునెమ్ములఁ జూడఁగోరు జాడఁదలిర్పఁ గొంతసేపు
హరిణశాబక విలోలాయతేక్షణముల వింతలుగనుఁరీతిఁ గొంతసేపుఁ
గాలయాపనసేయుచుఁ గాముఁడపుడు
ముందటికి లజ్జ వెనుకకు మొనసితిగియఁ
జెలిమికత్తియ లిరువంకఁజేరి కొలువ
వచ్చువిభుఁడున్న యావరివలని కలివ. ౯౯.

క. వచ్చియుఁ జెచ్చెరఁగదలక। యచ్చిగురుంబోఁడి మరునియరదముక్రియఁ దా
నచ్చటనిలిచిన సకియలు। మచ్చికతో నృపవరేణ్యు మందిరమునకున్. ౧౦౦.

క. తెచ్చి నరపాలు ముందఱ। నచ్చిలుకలకొలికినుంచి రతివలుకడఁకన్
బచ్చనివిలుకాఁ డిద్దఱ। హెచ్చుటికయొనర్చెఁ దూపులేయుచునంతన్. ౧౦౧.

సీ. నాగవల్లీ దళానయనము గావింతునని బయలెక్కనొయ్యారియొకతె
చిలుకల కాహారమలొసంగవలెనని యరిగె మెల్లన నీరజాక్షియొకతె

నన్నేలపిలిచెదనలినాక్షియిదవత్తుఁ బదపదమనియెఁ బడఁతియొకతె
తనకొక్కపనిగలదని విన్నవించి నేర్పునఁజాఱె నెలమితోఁ బాలఁతియొకతె
నర్మసఖులు దమమనమ్మున లజ్జాభ । రమ్ము తేటపడఁగ రభసగతిని
జరగిరట్లు వికచసరసీరుహాక్షి ల । జ్జాసనాథయయ్యెఁ జకితగతిని. ౧౦౨.

చ. అభిమతలీలతోఁ గిసలయంబులశయ్యకుఁ దార్చి భర్తయ
య్యభినిభయాన నాన మొగమెత్తకయున్నవిధంబుచూచి మో
హాధరము గన్పడంగ బరిహాసము సేయుచుఁ బల్కరింపుచున్
రభసవినోదలీల లలరం బ్రమదాంబుధిఁ దేలె నయ్యెడన్. ౧౦౩.

క. వెడవెడచూపులఁ గను నడ
దడఁబడఁ జనుఁ జెనఁగి శయ్య దార్చిన యెడలన్
జిడిముడిపడు విభు కౌఁగిటఁ
బడి వెడలు లతాంగి ముగ్ధభావాన్వితయై. ౧౦౪.

గీ. పలుకరించినఁ బలుకక బలిమినలుము
కొనినఁ జిక్కక ప్రతికూలతను నటించు
నంబుజానన విభున కత్యంతకామ
దోహద సుఖంబుచేసె సంతోషమొదవ.

చ. కినుకయొకింతపూని గిలిగింతలు మాని నరేశ్వరుండు వం
చనఁ గనుమూయుచో నిది నిజంబగునో యిఁకఁ బల్కరింతునో
యని కనువిచ్చిచూచు విభుఁడంత నగింగి దరస్మితంబుతోఁ
గనుఁగొనఁ గన్నుమూయఁ గలకంఠి తటిచ్చలనంబు కైవడిన్. ౧౦౫.

వ. మఱియును. ౧౦౬.

శా. నీవీబంధవిమోచనంబునకు నెంతే నాభిదేశంబుపైఁ
జేవేయం దమకింపుచున్నపతి యచ్చెయ్యోల్చి లోఁగించి ల
జ్జావిర్భావము దోఁపఁ దత్కరము ద్రోయన్ సాత్వికస్ఫూర్తిగా
నావేళం బ్రతిసేయఁగా నెఱుఁగలేవయ్యెం గళన్నీవియై. ౧౦౭.

క. అక్షతరదనచ్ఛదనా । లక్షితనఖరాంక రతికళాకేళికిఁ బ
ద్మాక్షి యొడంబడెఁ దానిత । రాక్షుద్రరతోద్యమంబు లవి గాకునికిన్. ౧౦౮.



సీ. మొనసి గాఢోపగూహనమునరించిన బెదరుచూపులతోడ సుదిగియుండు
నధరామృతాస్వాదనాసక్తిఁ గెమ్మోవి మొనపంట నొక్కిన మోమువంచుఁ
జనుదోయిపై నఖాంచలరేఖలలరింపఁబూనిన నొకవింతబూమె నెఱపు
నీవిపైఁ దేవతోఁ జేవేయనపుడు మిక్కిలి పెనంగక కొంత యలుక సేయు
సగము మదనుండు వ్రీడయు సగము దన్ను
జట్టిగాఁగొన్న విభునియిచ్చనె మెలంగు
మొదలిచెయ్వులు మాని యమ్ముద్దరాలు
మధ్యమాలీల నెఱపు సామగ్రితోడ. ౧౦౯.

చ. అదయకచగ్రహంబు లధరాధరబింబరదక్షతంబులుం
బాదలఁ గుచద్వయీకలిత భూరినఖాంకము లుల్లసిల్లఁగా
మదనకళారహస్యములు మాటికి నంటుచుఁ దృప్తిఁ జెంద క
మ్మదవతితో రమించె నృపమౌళి మనోహరలీల నయ్యెడన్. ౧౧౦.

క. అయ్యిరువురిట్లు మారుని । కయ్యంబొనరించి యలసి కడువేడుకతో
శయ్యపయి నిదురఁ జెందిరి । యయ్యెడలఁ బ్రభాతసమయమయ్యె న్వేగన్.

సీ. కెందమ్మిరేకులఁ గేరు కన్నులమీఁద నిద్దురకొఱఁత రాణించియుండ
విడెపుసేఁతలకెంపు విడిసొంపుగల మోవిపై రదక్షతములు బయలుపడఁగఁ
జిటిలుగండంబులతోఁ జన్నారిపాలిండ్ల నఖరాంకములు సమున్నతివహింపఁ
జెదరి ముంగురులు నెన్నుదటిపైఁ దిగజాఱ వదలిన కీల్గంటి వన్నెయొసఁగ
స్రుక్కి నెమ్మొగ మొకవింత సొబగుదాలుపఁ
జిక్కువడి తారహారముల్ చిందులాడఁ
బ్రాణవిభుకోర్కిఁ దీర్చు వైభవముతోడఁ
బడఁతి యోవరిలోఁ బయల్వెడలి నిలిచె. ౧౧౧.

చ. వందిప్రాతములందుఁ జేరి తగు [illegible]వించి యా
నందంబంది విపంచికావళుల [illegible]గ్రామవిస్ఫూర్తినిం
పొందం బాడుచు మేలుకొల్పిరి నిజోద్యోగంబు దీపింపఁగాఁ
గందర్పప్రతిమాను నమ్మనుజలోకస్వామి ధీరాగ్రణిన్. ౧౧౨.

క. ఈకరణి ననుపమాన । ప్రకటితుండగుచు నృపతి విరక్తిరీతిగ నా
ప్రాకటముగ నీసత్కృతి । యాకల్పము వెలయు సుకవు లభినందింపన్. ౧౧౩.

మ. ధనధాన్యాఢ్యనిశాంత శాంతజనసంతానావనానంద పా
వనధీవైభవకాంత కాంతనవిభావస్నైజలీలాశ్రయ
ద్ఘనకాంతాజనతాంత తాంత విమతక్ష్మాపాలమాళిప్రఘు
ట్టనధౌరేయపదాంత దాంతగుణకాండ ప్రాభవాలంకృతా. ౧౦౪.

క. చండకరతేజ మహీభృ । న్మండల గణనీయగుణసమాజ రణ ధరా
ఖండలతనూజ నానా । పండితసురభూజ చతురభాషాభోజా. ౧౦౫.

మాలిని. సతతవిమతజైత్రా సజ్జనారామచైత్రా
వితతగుణపవిత్రా విద్వదాస్యాబ్జమిత్రా
చతురనుతచరిత్రా చంద్రభూకాంతపుత్రా
భృతసమధికగోత్రా ప్రీతలక్ష్మీకళత్రా. ౧౦౬.

గద్య. ఇది శ్రీవక్కలంక చంద్రశేఖర మహాకవిపౌత్ర భాస్కరసుకవిపుత్ర
విద్వజ్జన విధేయ వీరభద్రనామధేయ విరచితంబైన వాసవదత్తా
పరిణయంబను మహాప్రబంధంబునందు
సర్వంబును బంచమాశ్వాసము.

---

సంపూర్ణము.

---

